సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.



సచిత్రవారపత్రిక

Founder . K. NAGESWARA RAO

సంపుటము 45
సంచిక 52
26-8-53

విజయ శ్రావణ ద్వితీయ బహుళ; బుధవారం


ఢిల్లిలోని "జంతర్ మంతర్"

ఫోటో :—శ్రీ వి. ఎస్. విఠల్ రావు (విజయవాడ)

# విషయానుక్రమణిక

ముఖచిత్రం : "పూర్ణకుంభ"
శ్రీ దేవీప్రసాద్ రాయ్ చౌదరి తయారుచేసిన శిల్పం.



# పాఠకులకొక మనవి

మా పత్రిక 29-7-53 తేదీ సంచికలో ప్రచురించబడిన 'ఒక సాయంత్రం' అనే కథానిక అపోహాలకు, కొందరి ఆవేదనకు హేతువయిందని మాకు తెలియవచ్చింది. ఈ విషయాన్ని మా దృష్టికి తెచ్చినవారికి కృతజ్ఞతాభివందనాలు.

ఒకానొక ప్రాంతంలో కొందరి వ్యవహారభాషను పరిచయం చెయ్యడమే మా ఉద్దేశంకాని, రాయలసీమ భాషను అధిక్షేపించడం ఎంతమాత్రం కాదని పాఠకులకు విన్నవిస్తున్నాము.

రాయలసీమ భాషకూ సర్కార్ల భాషకూ మాత్రమే వ్యత్యాసాలు పరిమితం కాలేదు. జిల్లా జిల్లాకు వాడుకభాషలో వ్యత్యాసమున్నది. వివిధ ప్రాంతాల, వారి వారి వాడుకలో కానవచ్చే వైచిత్ర్యాలు, మార్పులవల్లనే వ్యావహారిక భాషకు సొగసూ, పుష్టి కలుగుతాయి. ఇదివరలో తెలంగాణా, విజయనగరం, కృష్ణా, గుంటూరు ప్రాంతాల కొందరు కొందరు మాట్లాడే వాడుకభాషను పరిచయ పరచడానికి కథానికలను ప్రచురించినట్లే, కర్నూలు ప్రాంతంలో కొందరు వాడేభాషను పరిచయ పరచడానికి మేము చేసిన యత్నం దురభిప్రాయాలకు దారితీయడం విచారకరం. ఏ ప్రాంతంలో ఎవరెవరు వాడేభాషనైనా సరే 'న్యూనత' అనే సంకోచం విడిచిపెట్టి సముచితంగా పరిచయ పరచడానికి రచయితలను ప్రోత్సాహ పరచడం మా ఆశయం. పైకథానికలో వ్యవహారభాష సక్రమంగా వాడబడలేదని ఎవరైనా అనవచ్చునేమో. కాని, అధిక్షేపించే ఉద్దేశం మా పై ఆరోపించడం న్యాయంకాదు. 'రాయలసీమ భాషను' (ఏ ప్రాంతానిదైనా సరే) న్యూనత పరచడం తెలుగుభాషనే న్యూనత పరుచుకోవడమని మాకూ తెలుసును. ఏ వాడుకభాషను కాని 'వానరభాష' అని చెండనాడుకోవడం తెలుగుభాషకే అపచారమని మా అభిప్రాయం. ఇట్టి అపోహాలకు, దురభిప్రాయాలకు తావీయకూడదని సహృదయులకు మా విన్నపం.

సంపాదకుడు.

# గమనిక

12-8-53 వారపత్రికలో శ్రీ వి. ఎస్. చెన్నూరి వ్రాసిన "నాన్నగారి స్నేహితుడు" అనే కథ ప్రచురింపబడింది. అదే కథ 24-6-53 తేదీగల ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో ప్రచురింపబడినట్లు దరిమిలా మా దృష్టికి తేబడినది. రచయితలు ఒకే కథయొక్క కాపీలను అనేక పత్రికలకు పంపించడంవల్ల ఇటువంటి పొరబాట్లు సంభవిస్తూ వుంటాయి. రచయితలు మాకు పంపించే కథను మేము స్వీకరించినదీ లేనిదీ తెలిసేవరకూ ఆగి, స్వీకరించనిచో మరొక పత్రికకు పంపించవచ్చును. ఇలా చేయడంవలన రచయితలు మాకెంతో సహాయం చేసినట్లవుతుందని మనవి.

—సంపాదకుడు.

# కాలక్షేపం

"నీతిప్రౌఢ విహారులైన నిపుణుల్
నిందించనీ, మెచ్చనీ;
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ,
గాఢంబుగా సాగనీ;
ఘాతం బప్పుడ పొందనీ, నియతిపై
గానీ యుగాంతంబునన్;
నీతిశ్లాఘ్యపథంబు దప్పరుగదా
నిత్యంబు ధీరోత్తముల్."

తా॥ నీతిశాస్త్రంలో అధికులైన విద్వాంసులు నిందించినా సరే. మెచ్చినా సరే— గొప్ప ప్రఖ్యాతికి ఆధారమైన సంపదలు ఉంటేనేమి! పూర్తిగా పోతేనేమి? మరణం (విఘాతం) అప్పుడే వచ్చుగాక! లేదా, యుగాంతమునకే వచ్చుగాక! ధీరోత్తములైనవారు ప్రశంసనీయమైన నీతిమార్గమును ఎప్పటికిన్నీ తప్పి ప్రవర్తించరు గదా!

"నీతిశాస్త్రవేత్తలు నిందించినప్పటికీ నీతిమార్గం తప్పరు నీతిపరులు" అనే వాక్యానికి వ్యాఖ్యానం చేయడం కొంతవరకు అర్థం కాని పరమార్థం చెప్పినట్లుగా ఉంటుంది. ఎందుచేతనంటే నీతిమార్గం తప్పకుండా ప్రవర్తించేటటువంటి వాడు నీతిపరుడు. అటువంటివాని ప్రవర్తన విషయములో తప్పులుపట్టి నీతిశాస్త్రవేత్తలు నిందించడం అసంభవం. నీతివేత్తలు నిందించిన మార్గాన్ని అనుసరించేటటువంటివాడు నీతిపరుడు కాడు. ఇది ఎట్లా ఉంది అంటే, ఒకడు ప్రాణాయామం ప్రతిదినం సాధకం చేస్తూ చాలా నియమనిష్ఠగా ఉంటున్నాడు. ఈ ప్రాణాయామం సాధకం చేయడం మంచిది కాదని ఒక డాక్టరు సలహా యిచ్చాడు. ఆ నియమనిష్ఠాగరిష్ఠుడు మాత్రము ప్రాణాయామసాధకం పట్టు విడవకుండా చేస్తూనే ఉన్నాడు. "బ్రహ్మ వచ్చి చెప్పినాసరే, బ్రహ్మాండనాయకుడు వచ్చి చెప్పినా సరే, యీ ప్రాణాయామ సాధకం నేను మానను. ప్రాణం పోయినాసరే ప్రాణాయామ సాధకం విడిచిపెట్టను." అని ఆ మహాపురుషుడు భీష్మప్రతిజ్ఞ చేశాడు. ప్రాణశక్తి వృద్ధిపొంది వికసించడానికి ప్రాణాయామం చెయ్యాలి. ప్రాణం పోయేటందుకు ప్రాణాయామ సాధకం చేయడం కేవలం యమసాధకమే గాని నియమసాధకం కాదు.

"ప్రాణం పోయినాసరే ప్రాణాయామ సాధకం మానను", అనే వాక్యం అర్థంలేని మాట. ప్రాణం పోయినతర్వాత ప్రాణాయామ సాధకం అనేది ఎవ్వడూ చేయలేడు. కొంతమంది చేసేటటువంటి ప్రతిజ్ఞలు మతిలేని ప్రతిజ్ఞలుగానే మనకు కన్పిస్తాయి. కారణం ఏమిటంటే, అట్టివారికి ఉన్నటువంటి లక్ష్యం లోకానికి అతీతమైనది. ప్రాణం కాపాడుకొనే నిమిత్తమే వైద్యచికిత్స చేయించుకోవడం లోకసామాన్యమైన ధర్మం. వైద్యచికిత్స ఎందుకయ్యా అంటే, ప్రాణరక్షణకోసం. వైద్యచికిత్సకు లక్ష్యం ప్రాణరక్షణ. అటువంటి సందర్భములో మనము ఏదో ఒక వైద్యునిచేత వైద్యచికిత్స చేయించుకుంటాము. ఏదో ఒక వైద్యపద్ధతిని అనుసరిస్తాము. ఆయుర్వేద వైద్యంలో నమ్మకం ఉన్నటువంటివారు ఆయుర్వేద వైద్యుని రప్పించి చికిత్స చేయించుకుంటారు. వైద్యో నారాయణో హరిః అని ఆరాధించి, ఔషధం జాహ్నవీతోయం అని స్వీకరించి చేదు కషాయాన్ని అమృతంగా సేవిస్తారు. ఇంగ్లీషు వైద్యంలో నమ్మకం ఉన్నటువంటివారు నాన్యః పంథా అని ఆంగ్లేయ వైద్యుని ఆశ్రయించి ఆసుపత్రిలో చేరి ఆపరేషను చేయించుకొంటారు. హోమియోపతి వైద్యంలో నమ్మకం ఉన్నటువంటివారు హోమియోపతి వైద్యుణ్ని ఉమాపతిగా ఊహించి ఆయన ఆవగింజలవంటి మాత్రలిచ్చినా, ఆవకాయకంటె అతి మాటుగా పనిచేస్తాయనే నమ్మకంతో, హనుమాన్ సాధించి తెచ్చిన సంజీవియే, "హన్నామన్" లోకాన కచ్చిన హోమియోపతి మందులని గౌరవించి ఆరగిస్తారు. ప్రకృతి చికిత్సనే సర్వరోగభయ ప్రభంజన శక్తిగా నమ్మినవాళ్లు ఉన్నారు. ప్రకృతి అంటే మారుతి యని భావించి, ఆంజనేయదండకం చదివి ఆరోగ్యం పొందినట్లుగానే, శీతలజల స్నానంతో ఆతపస్నానంతో ఆమయం లేని నిరామయులం కావచ్చుననీ అమరులం కావచ్చుననీ ఎంచి ప్రకృతి చికిత్సనే అనుసరించి అప్పుడు పుట్టినబిడ్డకుకూడా తొట్టిస్నానం చేయించే వాళ్లున్నారు. మంత్రవైద్యానికి మించిన మందు ఉంది అనేవాడు మందుడనియు మందమతియనియు వాదించేవాళ్ళు ఉన్నారు. పాము విషమునుకూడా పది నిమిషాలలో చెదరగొట్టే మంత్ర ప్రభావానికి లొంగని రోగాలు అభావం అని నమ్మిన మనుజుండు మంత్రవైద్యుణ్ని పిలిపించి రక్షరేకులు కట్టిస్తాడు. విభూతి పెట్టిస్తాడు. హాజరైన మంత్రవేత్త "హ్రాం హ్రీం ఫట్ స్వాహా" అంటేనే చాలు హాయిగా ఉంటుంది అతని మనస్సుకు. బాధలు తగ్గుతాయి యీ వ్యాధిగ్రస్త కళేబరానికి. మంత్రానికి మించినది లేదని ప్రేమించేవాళ్ళున్నారు. కాని, మంత్రాలకు చింతకాయలు రాలుతాయా? అని చింతించి శంకించేవాళ్లున్నారు. కమ్మని మురబ్బాలూ, తియ్యని షర్బత్తులు, గుల్కందు, జబారష్, జిందాతిలిస్మాత్ మొదలైన యూనానీ మందులతో మానని వ్యాధులుండవు. ఎట్టి వ్రణములనైనా మందు పట్టీలతో మాన్పగల హకీము లున్నారు. యూనానీ వైద్యంకంటె ఘురానా వైద్యం ఫలానా ఉన్నదని చూపగలవాడు లేడు యీరేడు జగంబులందను "గడగట్టి ఘోరి కోదాండ డడాంపె డాండ నినదంబు లజాండము నిండచాటెడివారు ఉన్నారు. ఈవిధంగా ఎవరికి ఏ వైద్యంలో గురి ఉంటే ఆ వైద్యపద్ధతినే అనుసరించి ఆ చికిత్సనే చేయించుకొంటారు. నిజమే.

ఆయుర్వేద వైద్యుణ్ని అప్పలాచారిగారిని పిలిపించడంలో ఉద్దేశం ఏమిటి? ఆయన చేసేది ఆయుర్వేద వైద్యమే. అటువంటి ఆయుర్వేద వైద్యులు ఎందరో ఉన్నారు. కాని, అప్పలాచార్యులుగారి హస్తవాసి మంచిది. ఆయన వచ్చి చేయి చూశాడంటేనే చాలు. "పారజూచిన పరసేన పారజూచు" అన్నట్లుగా వ్యాధిలో సగం మాయమైపోతుంది. ఆయన చేతితో చెరువులోని మన్ను కలిపి "తటాకమృత్తికేశ్వరం ఇది" అని యిచ్చినప్పటికీ, అది స్మారకం తప్పినవానికికూడా సంజీవిలాగున పనిచేస్తుందనే నమ్మకం ఉండడంవల్లనే అప్పలాచార్యులుగారిని పిలిపించడం సంభవించింది. కాని, వారం పదిరోజులు

## ★ కాలక్షేపం ★

ఆయన వైద్యం సాగిన పిమ్మట, లేదా ఒక మండలంపాటు మందు సేవించిన పిమ్మట వ్యాధి వెనుకకు మరలకుండా, దినదిన ప్రవర్ధమానమవుతూ ఉన్నప్పుడు ఏం చెయ్యాలి? వెంటనే ఆ వైద్యం మాన్పించాలి. ఇంగ్లీషు డాక్టరుకు చూపించి, పెన్సిలిన్ యింజెక్షనులైనా యిప్పించాలి. అవి కూడా పనిచేయకపోతే, అనంతర కర్తవ్యం ఆలోచించాలి. పెన్సలిన్ ఇంజక్షను కంటె పెద్దవి ఏ ఫాంటెన్‌పెన్ ఇంజక్షనులో ఏభయి రూపాయిలైనా ఎంత ఖరీదైనా సరే యిప్పించాలి. నూరు లెక్కిస్తే పోని వ్యాధులుకూడా ఉండవచ్చు. నూరిటితో పోనిదానికి గొడ్డలితోనైనా పోతుందని అంగీకరించాలి. నూరు లెక్కిస్తే బాధలు తగనప్పుడు కత్తులతో పనిచేసి నెత్తురుతీసి నెత్తు రెక్కిస్తారు. కనుక, ఆయుర్వేద వైద్యమునే నమ్ముకొని, అప్పలాచార్యులు గారినేఆశ్రయించి "త్వమేవ శరణం మమ"- "జానామి సత్యం వినా" (నీవే నాకు శరణ్యం - నీవు తప్ప ఇతః పరంఎరుగ) అని కూర్చుంటే బాధ పోతుందా? ప్రాణం నిలుస్తుందా? కనుక ఆయుర్వేదంతో ఆవేదన తగ్గనప్పుడు, ఆరోగ్యం ఏర్పడనప్పుడు, వెంటనే "మాధవా! మన రథంబు మరలనిమ్మ" అని నిర్ణయించి, ఆయుర్వేద వైద్యమును అంతటితో ఆపివేసి, ఆంగ్లవైద్యం ప్రారంభిస్తాము. అదికూడా ఆశ్వాసాంతం చూచి, అటుపైన నవగ్రహ జపాలు చేయిస్తూ, ద్వాదశ లవంగచికిత్స చేయించవచ్చు-లేదా సుందరకాండ పారాయణం చేయిస్తూ, సులేమాన్ సాహెబ్ గారి శిలాజిలేట్ లేహ్యం సేవించవచ్చు. అదీ వీలుకాకపోతే, హనుమద్దండకం చదువుకుంటూ హోమోపతి మాత్రలు ముప్పులేని ముప్పయి ధాటినుంచి సాహసోపేతమైన సహస్ర ధాటివరకు సేకరించి స్వీకరించవచ్చు. ఆ విధంగా కాకుండా "స్థిరోభవ వరదోభవ, సుప్రసన్నోభవ" అని ఒక్కటే వైద్యాన్నిగాని, ఒక్కడే వైద్యుణ్ణిగాని నమ్ముకొని, "పాలముంచినా, నీటముంచినా నీవే గతి యని" మన ప్రాణానికీ, వైద్యునకూ ముడి పెట్టుకొని ఉండడం మూర్ఖత్వం అంటాము. అది అవివేకం అంటాము. అది బ్రతుక నేర్చినవాని పద్ధతి కాదంటాము. "ఆయుర్వేద ఔషధం తప్ప మరొకటి అరగించను" అని భీష్మించినవాడు చివరకు కాళ్ళు చేతులు చల్లబడి బిగిసి భీష్మించవచ్చు. అయితే, అతని ఆత్మవిశ్వాసం ఏమిటంటే, "ఆయువు అనేది ఉంటే, ఆయుర్వేద వైద్యం అమోఘంగా పనిచేస్తుంది. ఆయుఃప్రమాణం లేనివానికి ధన్వంతరి వచ్చి సంజీవి ఇచ్చినా, సార్థకం లేదు. ఆలెక్కకు వస్తే ఆనాటి ధన్వంతరియే ఏనాడో అస్తమించాడు. వైద్యుని భార్యకు కూడా మా వైధవ్యం తప్పదు. కనుక, ఆయుర్వేదం అవకతవక వైద్యం అనడానికి వీలు లేదు. తుట్టతుదకు తులసితీర్థమైనా అప్పలాచారిగారి చేతితోనే యివ్వాలి. అందుచేత ఆరోగ్యం కలిగినా, ఆయువు మూడినా ఆయుర్వేదమే అనుసరించాలి" అని వాదించడం వీరాయుర్వేద వాదుల మతం. కాని, ఈవిధంగా వాదిస్తే ఇదంతా ప్రాణంతో సంబంధించిన ఆయుర్వేదం జూదం అని అన్య వైద్యవిద్యాపరిజ్ఞానంగల ప్రముఖులు పరిహసిస్తారు.

ఇంతదూరం యీవిషయం విస్తరించి ప్రస్తావించడానికి కారణం ఏమిటంటే, ఏ వైద్యవిద్యా విధానమైనా ఎందుకూ పనికి రానిదని ఏరి పారవేయుటకు వీలులేదు. ఆర్యులు నేర్పిన ఆయుర్వేదమెంత గొప్పదో, దొరలు నేర్పిన ఆంగ్లేయ వైద్యం కూడా అంత దొడ్డదే. కృత్రిమఔషధముల కంటె ప్రకృతి చికిత్స ప్రశస్తంగా పనిచేస్తుందనే మాటకూడా ప్రమాణంగా పాటించవలసిందే. గాంధిమహాత్ముడు ప్రకృతి వైద్యాన్ని ప్రోత్సహించాలని పట్టుదలతో ప్రయత్నించాడు. ఆయన దక్షిణాఫ్రికాలో టాల్‌స్టాయి ఆశ్రమం అనేపేరుతో ఆశ్రమం ఒకటి ఏర్పాటుచేసిన నాటినుంచీ ప్రకృతి చికిత్సను ప్రశంసించి అనుసరించాడు. భారతదేశానికి వచ్చిన తర్వాత సబర్మతీ ఆశ్రమంలో కూడా ఆయనకు ఆ చికిత్స అంటే అభిమానం అధికమైంది. కాని, అటువంటి గాంధిమహాత్ముడు అలౌక్యుడు కాడు. తాను పట్టినకోడికి మూడే కాళ్ళని వాదించడు. ఆయనకు ప్రేగులలో ఒక కండ పెరిగి అప్పెండిసైటిస్ (ఆంత్ర ప్రదాహము) వ్యాధి వచ్చినప్పుడు ఆయనకు ఆపరేషను చెయ్యాలని ఆంగ్లవైద్యులు ఆదేశించారు. అందుకు ఆయన అంగీకరించాడు. ఫలితంగా శస్త్రచికిత్స జరిగింది. సవ్యంగా ఆరోగ్యం పొందడం జరిగింది. ఆయన ప్రకృతి వైద్యంలోనే మునిగి తేలుతానని భీష్మించలేదు.

### మా పాఠకులకు మరొక క్రొత్త ఆకర్షణ

# ఆంధ్రపత్రిక

### సచిత్ర వారపత్రిక

## విక్టర్ హ్యూగో
## ప్రసిద్ధ నవల అనువాదం

ఫ్రెంచి నవలా రచయిత విక్టర్ హ్యూగో నవలల్లో ప్రసిద్ధమైన "హంచ్ బాక్ ఆఫ్ నాటర్ డామ్" (Hunchback of Notre Dame) నవల ఆంధ్రానువాదం త్వరలో మా వారపత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడనున్నదని తెలుపుటకు సంతసిస్తున్నాము. మా సీరియల్స్ అన్నిటినీ పాఠకులు ఆదరించినట్లే ఈ క్రొత్త సీరియల్‌ను కూడా ఆదరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

అదే మహాత్ముడు అనుసరించే సర్వమత సమన్వయ మార్గం. ఆయన హిందూమతస్థుడు. తన మతం హిందూమతం అని నిర్వచిస్తాడు. కాని, ఆయన ప్రార్థనా సమావేశాలలో మహమ్మదీయుల కొరాను చదివిస్తాడు. క్రయిస్తవుల బైబిలు చదువుతాడు. భగవద్గీత పారాయణం చేస్తాడు. పారశీ మతస్థుల ఛందో అవస్థా కూడా సావధాన చిత్తుడై చదువుతాడు. అయితే, ఆయనకు ఏమతంలో అభిమానం ఉన్నదని అన్వయించాలి? ఏ మతస్థుడని నిర్ణయించాలి? ఆయన ప్రత్యేకంగా ఏమతానికీ చెందని సర్వమతసర్వేశ్వరుడా? గాంధిమహాత్ముడు అంతటి నిర్గుణ బ్రహ్మనని ఎప్పుడూ చెప్పుకోలేదు. తాను హిందువునే అని చెప్పుకొన్నాడు. అయితే, ఇతర మతాలతో హిందూ మతానికి పొత్తు కలియదనే సిద్ధాంతం ఆయన అంగీకరించలేదు. సత్యం అనేది అనంతం. జ్ఞానం అనేది అనంతం. విద్య అనేది అనంతం. శాస్త్రములపారములు. అటువంటి సందర్భంలో సత్యం అనేది ఎక్కడ కన్పించినప్పటికీ, సగౌరవంగా దానికి సమ్మతించవలసిందే. అటువంటి సందర్భంలో నాది "హిందూమతం" అని ప్రత్యేకంగా వ్యక్తీకరించి వక్కాణించడం ఎందుకు? అని ప్రశ్నిస్తే మహాత్ముడందుకు మంచి సమాధానం యిచ్చాడు "నేను ప్రేమించి వివాహమాడిన ధర్మపత్ని కస్తూరీబా మాత్రమే. కాని ప్రపంచంలోని యితర స్త్రీలయెడల నాకు ద్వేషం లేదు. వారందరియెడలను నాకు

(52-వ పేజీ చూడండి)

# దసరా సంచిక

## పిల్లలకు ప్రత్యేకాకర్షణ

## కథలు, గేయాలు, చిత్రాల రచనలో పోటి

రాబోయే 'విజయదశమి' పండుగకు (1953 అక్టోబరు 17 వతేదీ) ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతుందని పాఠకులకు తెలుపడానికి ఆనందిస్తున్నాము. బాలబాలికలకు ఉల్లాసం, విజ్ఞానం కలిగించే చక్కని కథలు, గేయాలు, వ్యాసాలు, బొమ్మలతో పత్రిక ఆకర్షణీయంగా తయారవుతుంది.

బాల బాలికల రచనాశక్తిని, చిత్రలేఖనాశక్తిని ప్రోత్సహించడానికి గాను పోటీ పెడుతున్నాము. ఈ పోటీలో ఒక మంచికథకు, ఒక మంచిపాటకు, ఒక మంచిబొమ్మకు బహుమతులివ్వబడతాయి.

ఈ సందర్భంలో రచనలు, చిత్రాలు పంపదలిచేవారు ఈ క్రింది అంశాలను గుర్తుంచుకోవాలి.

* పదిహేనేళ్ల లోపు బాల బాలికలు మాత్రమే ఈపోటీలో పాల్గొనవచ్చును.
* కథలు, గేయాలు, బొమ్మలు స్వతంత్రమైనవై ఉండాలి.
* కథలు గేయాలు కాగితానికి ఒకేప్రక్క సిరాతో స్పష్టంగా వ్రాయాలి.
* బొమ్మలు రంగులలో కాని, రంగుకాగితం పైనకాని సిరాలతో వ్రాసినవిగాని పనికిరావు. ఇండియన్ ఇంక్‌తోగాని పెన్సిల్‌తోగాని వ్రాసిపంపాలి.
* రచనలు, బొమ్మలు 1953 సెప్టెంబరు 15 వ తేదీలోగా మాకు చేరేవిధంగా పంపాలి.
* రచయితలు చిత్రకారులు తమ పూర్తిపేరు (ఇంటిపేరు కూడా) వయస్సు, చిరునామా అన్నీ వివరంగా రచనలూ చిత్రాలతో పాటే వ్రాసి పంపాలి.
* స్వీకరించబడని రచనల్ని, బొమ్మల్ని తిప్పి పంపాలని కోరేవారు చాలినంత స్టాంపులుకూడా చేర్చి పంపాలి.
* కవర్లపైనా లేక రేపర్లపైనా "ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక దసరా పోటీకోసం" అని స్పష్టంగా వ్రాసినవి మాత్రమే పోటీకి స్వీకరించబడతాయి.

# ముదిలేక నేర్వగరాని విద్య

క నకదుర్గ వీధి ఇరవైనాలుగో నంబరు ఇంటిముందర నిలిచి సుందరరావు ఇంటి లోపలివాళ్ళని "సార్, ఏమండీ, ఏమండీ, సార్" అని గొంతెత్తి పిలిచీ పిలిచీ ఎవరూ పలక్కపోవడంచేత తలుపు దబదబా బాద సాగేడు. కొంతసేపటికి కవాటం తెరచుకోగా పుత్తడి బొమ్మవంటి ఒక యువతి, అతనికి ప్రత్యక్షమై "ఏమిటండీ, తలుపును బాదేస్తున్నారు మేనర్‌లెస్‌గా" అన్నది తీవ్రంగా!

"క్షమించాలి. నేను ఐదు నిమిషాలనుంచీ పిలుస్తున్నాను. ఎవరూ పలక్కపోయి నందువల్ల..." అంటూ రాగంతీశాడు సుందరరావు.

"సాయంత్రం నాలుగ్గంటలకు మీరు రాగలరని తెలిసివుంటే మేము తలుపు తెరచుకొని, మీకు స్వాగత మివ్వడానికి సిద్ధంగా కూచొని వుండేవాళ్ళం! ఆ విషయం తెలియకపోవడంవల్ల మిమ్మల్నింతసేపు వీధిలో నిలబెట్టినందుకు మేము క్షంతవ్యులం! ఇంతకూ మీ రిక్కడి కెందుకు వచ్చివుంటారో మేము ఊహించుకోలేకపోతున్నాం" అన్న దావిడ పైకి గౌరవాన్ని, నిజానికి నిర్లక్ష్యాన్ని కనబరుస్తూ.

సుందరరావు నేను హెడ్మాస్టరుగారితో మాట్లాడవలసి వచ్చాను" అంటూ ఆమె లోపలికి రావచ్చునని చెప్పకముందే గృహప్రవేశంచేసి, ఒక కుర్చీలో కూచుంటూ "వారు మీకేమౌతారో నాకు తెలియదు" అన్నాడు.

"తెలుసుకోవలసిన అవసరం మీకేమైనా వుందా?" అని ఆ యువతి ప్రశ్నిస్తుండగా లోపలినుంచీ "ఏమిటమ్మా సరళా! ఎవరితో పోట్లాడుతున్నావ్?" అంటూ అక్కడికి వచ్చింది ఒక పండుముత్తైదువ. సుందరరావు లేచి నిలచుకొని "అబ్బే, పోట్లాడడం లేదండీ. నేను తలుపు బాదినందుకు, ఆమెకు కోపం వచ్చింది" అన్నాడు.

ముసలావిడ "మరేమీ అనుకోకు నాయనా! మా అమ్మాయికి కొత్తా, పాతా పట్టింపులు లేవు. ఎవరితోనైనాసరే, గడగడ మాట్లాడేస్తుంది. అయ్యో, నిలుచున్నావేం బాబూ! ఫరవాలేదు కూచో" అన్నది సోఫాపై కూచుంటూ.

తల్లి రాగానే లోపలికి వెళ్ళిపోతున్న సరళను చూస్తూ ఈలాటి శాంతస్వరూపిణికి ఆలాటి కూతురెట్లా పుట్టిందోనని సుందరరావు ఆశ్చర్యపడ్డాడు. తన పాతికేళ్ళ వయస్సులో అతడు ఇద్దరుముగ్గురు స్త్రీలతో మాత్రం చనువుగా మాట్లాడగలిగాడు. ఆ ఇద్దరు ముగ్గురిలో అతని తల్లి ఒకతె. మిగత ఇద్దరూ అతని చెల్లెండ్రు. మరి ఈనాడు సరళతో ఎన్నాళ్ళనుంచో పరిచయమున్న వాడిలా జంకుగొంకులు లేకుండా తను మాట్లాడగలిగినందుకు, ఆ యువతియొక్క విలక్షణ స్వభావమే కారణమై యుండవచ్చు ననుకున్నాడు సుందరరావు.

---

## శ్రీ మధురాంతకం రాజారాం

---

ముసలావిడ "మీ కేవ్వూరు నాయనా?" అన్నది. సుందరరావు ఆలాటి ప్రశ్నకే ఎదురుచూస్తున్నాడు కాబట్టి అవకాశం దొరగ్గానే "మా స్వస్థలం నెల్లూరండీ. 'బీయస్సీ' ప్యాసయ్యాను. ఇక్కడ హైస్కూలులో ఒక సైన్సు అసిస్టెంటు కావాలని పత్రికల్లో ప్రకటిస్తే, హెడ్మాస్టరుగారిని చూచిపోదామని వచ్చాను. నా పేరు సుందరరావు" అన్నాడు.

సుందరరావుయొక్క విద్యా విషయిక యోగ్యతలు తెలుసుకోవాలన్న కోరికకన్నా అతనికి పెళ్ళయిందో లేదో తెలుసుకోవాలన్న ఉద్దేశ్యం ముసలావిడకు బలీయంగా వుంది. పెళ్ళికి తయారైవున్న కుమార్తె ఇంట్లో వున్నప్పుడు ఏ తల్లికైనా ఇటువంటి కోరికవుండడం సహజమే. ఆమె సుందరరావును కొంతసేపు ఎగాదిగా చూచి "నీకు పెళ్ళైందా?" అని ప్రశ్నించింది.

"పెళ్ళా! దాని కిప్పుడేం తొందర?" అని, ఇంక ఆ విషయాన్ని గురించి మాట లెక్కడ పెరిగిపోతాయోనని సుందరరావు టేబిల్ పైన పేపరు తీసి చదవసాగేడు.

ఇంతలో అడుగులచప్పుడు వినవచ్చింది. వస్తున్నవారు హెడ్మాస్టరు పరమశివంగా రేమోనని సుందరావు లేవబోయాడు. కానీ వచ్చింది సరళ. ఆమె బీరువాలోనుంచీ ఒక పుస్తకాన్ని తీసుకొంటూ "పోయిన వారం కాబేజీ వడలు చేశాను గదమ్మా! ఈవారం మరో కొత్త పిండివంట నేర్చుకోబోతున్నా"అన్నది. ఒక అధునాతన యువతి కొత్త సినిమాలని విమర్శించడమో, క్రొంగొత్త ఫేషన్ చీరల్ని గురించి చర్చించడమో గాక, పిండివంటల్ని గూడా చేయగలదన్న విషయం సుందరరావుకు అపూర్వంగానూ, అద్భుతంగానూ తోచింది.

"ఏం చేయబోతావేమిటి?"అన్నది ముసలావిడ. "కాలీఫ్లవర్ పకోడీలు" అన్నది సరళ. అవి ఏలా వుంటాయోగదా అని విభ్రమం చెందాడు సుందరావు!

"వాటిని చేయడానికి కావలసిన వస్తువులేమిటి?" అని ప్రశ్నించింది వృద్ధురాలు. "ఏమో, నాకుమాత్రమేం తెలుసు! నేనూ ఇంకా చదవలేదు. చదివి నీకూ గూడా విని పిస్తానుండు" అంటూ సరళ పుస్తకాన్ని తెరచి, ఎక్కడో ఒకచోట చదవడం మొదలెట్టింది.

"కాలీఫ్లవర్ పకోడీలు: ఇవి చేయడానికి కావలిసిన పదార్థాలు—మూడు మంచి కాలీ ఫ్లవర్స్. తెల్లగా, ఏపుగా పెరిగిన పువ్వు ఏదైతే వుందో అదిమాత్రమే మంచి పువ్వని గుర్తించాలి. పచ్చని పువ్వుల్లో పురుగులుంటాయి. ఆ పురుగులు మానవులు ఆహారంగా ఉపయోగించుకోడానికి ఎంతమాత్రం తగినవి కావు.

"అర వీసె సెనగపిండి: వర్తకు లప్పుడప్పుడూ ముగ్గిన సెనగపిండిని అమ్మేస్తుంటారు. బజారుకు వెళ్ళే మగవాళ్ళతో మంచి శెనగపిండికి, ముగ్గిన శెనగపిండికీ భేదం తెలుసుకోవడ మేలాగో చెప్పి పంపాలి.

"రెండు తవ్వల నూనె: ఆముదం తప్పా మిగతా నూనె లన్నింటినీ కళ్లు మూసుకొని ఉపయోగించుకోవచ్చు. నెయ్యి, డాల్డా ఐతే మరీ శ్రేష్ఠం.

"తగినన్ని పచ్చిమిరపకాయలు!!

"ఉప్పు కొంచెం! పసుపు. (ముఖానికి పూసుకునే పసుపు కాదు, కూరల్లో వాడేదే) కడపటి వస్తువు సోడా.

"కాలీ ఫ్లవర్స్‌ని, పచ్చిమిరపకాయల్ని ముక్కలుగా కోసుకొని, శెనగపిండి, ఉప్పుసోడాలు ఒకటిగా జేసి నీళ్లు చల్లిన తర్వాత దీంతో కలిపేయాలి. బూరెల మూకుడులో నూనెపోసి అది మరిగాక పై మిశ్రమ పదార్థాన్ని ముద్దలు ముద్దలుగా జేసి దాన్లో వేయాలి. ఈ వంటకాన్ని కొత్తగా చేసేవాళ్లు, దగ్గరొక గడియారా



పరమశివంగారు పకోడీలు చేయడంలో అవలంబించే వేర్వేరుపద్ధతుల్ని గురించి లెక్చరు కొడుతున్న సమయంలో సుందరరావు ప్లేటులో పకోడీల నన్నిటినీ తన పాంటు జేబులోనికి చేరవేసి... సావధాన చిత్తుడై వినసాగాడు.

న్నించుకొని, సరిగ్గా రెండు నిమిషాలకొక సారి పెనంలోవున్న పకోడీలను పైకి తోడుకుంటే, అవి మాడిపోయి తిండానికి ఉపయోగించకుండా పోయే బాధనుంచీ సులభంగా తప్పించుకోవచ్చు.

"ఇక ఈపకోడీల రుచి: మీరందరూ వీటిని చేసి తినబోతున్నారుగా! తినబోతూ రుచు లడగడ మెందుకు?"

చదవడం ముగించిన సరళను ముసలావిడ "ఆకాలీఫ్లవర్స్‌ని తెప్పించావా?" అని అడిగింది.

"ఓ! వాటిని తెల్లవారే తెప్పించానే" అంటూ సరళ పుస్తకాన్ని చేతినే వుంచుకొని లోపలికి వెళ్ళిపోయింది.

"ఇక పదినిమిషాల్లో ఆపకోడీలు సిద్ధమై పోతాయ్" అన్నది సరళతల్లి.

"అలాగా!" అన్నాడు సుందరరావు.

"సందేహమెందుకు? నువ్విక్కడే వున్నావుగా. తిని చూద్దువు వుండు" అన్నదామె

"అబ్బే వద్దండీ అసలు నేను మంచి పకోడీలే తినను. ఈ కాలీ ఫ్లవర్ పకోడీ లనేటటువంటివి ఎలావుంటాయో ఏమో" అని సందేహాన్ని వెలిబుచ్చాడు సుందరరావు.

"వాటికేం? చాలా బాగా వుంటాయ్. మాసరళకు సాధారణంగా ఒళ్ళు వంగడం తేగానీ, వంగితేమాత్రం ఘనంగా తయారు చేస్తుంది పిండివంటలు" అన్నది ముసలావిడ.

సుందరరావు నవ్వి "మాచెల్లెలో కామె చాలా కర్ణకఠోరంగా పాడుతుంది. మా అమ్మకుమాత్రం తనకూతురు లతామంగేష్కర్ కన్నా శ్రావ్యంగా పాడుతుందని దృఢనమ్మకం. తల్లిదండ్రులకు తమ బిడ్డల పైన ఈలాటి నమ్మకాలుండడం ఏమంత అసహజంకాదు ఐతే వాళ్ళకు కొడుకులపైన కంటే కూతుళ్ళపైనే ఈ నమ్మకా లెక్కువేమో" అన్నాడు.

ఐదుగంటలు కావస్తోంది. ఇక కొంతసేపు అక్కడ కూచుంటే తప్పనిసరిగా కాలీఫ్లవర్ పకోడీలు తినవలసివస్తుందని సుందరరావుగుండెల్లో దడ బయలుదేరింది. అతను 'మళ్లీ రేపెప్పుడైనావచ్చి హెడ్మాష్టరు గారితో మాట్లాడుకోవచ్చు. ఈసారి

# ముదితల్ నేర్వగరాని విద్య

మాత్రం ఎంత త్వరగా బయటపడితే అంత మంచిది' అనుకొని, అక్కడినుంచీ వెళ్ళిపోవడానికి ఉద్యుక్తుడయ్యాడు. ఇంతలో ఎవరో వీధి తలుపు తెరచుకొని లోపలికి వచ్చారు. సుందరరావు లేచి నిలబడబోయి, ఆగంతకుడు తనలాగే ఒక యువకుడు కావడంవల్ల అలాగే కూచొని వుండిపోయాడు. కొత్తమనిషి "హెడ్‌మాస్టరుగారు ఉన్నారాండీ?" అంటూ వచ్చి సుందరరావు ప్రక్కనే ఒక స్టూలుపైన కూచొన్నాడు.

"నువ్వేం పనిమీదవచ్చావు నాయనా?" అన్నది ముసలావిడ.

"ఇక్కడ హైస్కూల్లో ఒక టీచరుపని వుందని వింటిని. అందుకొరకే వస్తిని" అన్నాడతను.

సుందరరావు అతని వాగ్ధోరణికి నివ్వెరపోయి "మీరు అరవవాళ్లా?" అన్నాడు.



అతడు "అవును" అన్నాడు. అతడు అవును అనడంలో 'ఐతేనేం' అన్న అర్థం ధ్వనించింది.

వృద్ధురాలు "అదిగో ఆయనకూడా అందుకే వచ్చాడు" అన్నది సుందరరావును చూపిస్తూ.

"మీ క్వాలిఫికేషన్ ఎంతండీ?" అని ప్రశ్నించాడు నూతన వ్యక్తి. 'ఒకవీశెడు' అని చెబుదామనుకున్నాడు సుందరరావు. కానీ ఇతడితో వితండవాదం ఎందుకులే అనుకుని "బీ యస్సీ ప్యాసయాను" అన్నాడు. "నేను బియస్సీ ఆనర్స్‌లే" అన్నాడా అరవమనిషి 'నీకేమిటి, ఉద్యోగమేమిటి, పోపోవయ్యా' అన్నట్టుగా!

సుందరరావుకు ఇక తనక్కడ వుండి లాభం లేదనిపించింది. కానీ ప్రయత్నించడంలో తప్పులేదుగా. 'ఆ పరమశివంగారెప్పుడొస్తారో గానీ, అంతవరకూ ఇక్కడినుంచీ కదలగూడదు' అని నిర్ణయించుకుని మళ్ళీ పేపరు చదువుకోడంలో నిమగ్నుడైపోయాడు సుందరరావు.

ఆరుగంటలకింక పదినిమిషాలుండనగా పరమశివంగారు వచ్చారు. ఎడముఖం, పెడముఖంగా కూచునివున్న ఇద్దరు యువకుల్నీ ముసలావిడ ఆయనకు ఇంట్రొడ్యూస్ చేసింది. పరమశివంగారు అంతవరకూ తన భార్య ఆక్రమించివుండిన సోఫాపై కూచుని పై ఇద్దరియొక్క విద్యావిషయకాలైన సర్టిఫికేట్లను శ్రద్ధగా చూచుకుంటూ వుండగా రెండు ప్లేట్లలో కాలీఫ్లవర్ పకోడీలు అక్కడికి రానే వచ్చేసినాయ్!

ఉపాహారాన్ని తెచ్చిన భార్యను పరమశివంగారు 'ఏమిటది?' అని ప్రశ్నించారు. ప్లేట్లలోవున్న భక్ష్యాలు పకోడీలని ఆయన ఊహించుకోలేకపోయినందుకు సుందరరావు ఆశ్చర్యపడలేదు. ఈ విశాల జగతిలో ఆ తినుబండారాల్ని చేసిన అమ్మాయి, ఆమె వాటిని చేస్తున్నదనే విషయం తెలిసిన ఆమె తల్లి, తాను - ఈ ముగ్గురికీ తప్ప, మరెవరుగానీ అవి పకోడీలని అనుకోవడానికి ఎంతమాత్రమూ ఆస్కారం లేదని అతడు వాటిని చూచినతక్షణాన్నే గుర్తించాడు.

"ఇవి పకోడీలండీ! మన సరళ చేసింది" అన్నది పరమశివంగారి భార్య. ఆమాట వినగానే ఆయనగారి ముఖం అమందానందంతో కళకళలాడింది. ఆయన "ఏమిటే! పోయినవారం వడలు! ఈరోజు పకోడీలు! గుడ్‌గుడ్" అని ఒక స్వగతం చెప్పుకుని తర్వాత భార్యకేసి చూస్తూ "ఇన్ని రోజులూ మన సరళకు వంట చేయడం రాదేమోనండీ అని కొండంత కష్టం తలపైన పడ్డట్టు కుమిలిపోయేదానివే, ఇప్పుడేమంటావ్! పట్టుదల అనేది ఒకటి ఉండాలి గానీ, ఏ విద్య అయితేనేం, రాకేం చేస్తుంది! వచ్చినట్టు వస్తుంది! పైగా 'ముదితల్ నేర్వగరాని విద్య గలదే ముద్దార నేర్పించినన్' అన్నాడొక మహాకవి. ఆ సుభాషితం సత్యమని మన సరళ ఎప్పుడో ఒకప్పుడు లోకానికి నిరూపిస్తుందని నా నమ్మకం" అన్నారు.

నమ్మకాలను వుంచుకోవడానికి మానవుని కెంత స్వాతంత్ర్యం వున్నప్పటికీ, ఆ స్వాతంత్ర్యాన్ని పరమశివంగారు దుర్వినియోగం చేస్తున్నందుకు సుందరరావు మనసులో చాలా నొచ్చుకున్నాడు.

ముసలావిడ ఒక ప్లేటు సుందరరావుకు, మరో ప్లేటు తమిళ యువకునికీ ఇచ్చి లోపలికి పోబోతుండగా పరమశివంగారు "నా సంగతి మరిచిపోవుగదూ!" అన్నారు. ఆమె కొంచెం తటపటాయించి "మిగతా పకోడీలు కొంచెం మాడిపోయినట్లున్నాయండీ" అన్నది. హఠాత్తుగా కల్గిన ఆశాభంగంవల్ల పరమశివంగారు ఒకటిరెండు క్షణాలపాటు నిశ్శాంతపడిపోయి, తర్వాత "కావలిస్తే రేపు మళ్ళీ తయారుచేసుకోవచ్చు గానీ, ఇప్పుడు వాటినెవరూ తినకండీ" అన్నారు.

పకోడీలు 'కొంచెం'గా మాడిపోయి వుంటే, అందుకు వాటిని చేసిన సరళను నిందించి లాభం లేదనీ, పాకంయొక్క పరిపక్వతను నిర్ణయించేందుకు ఆమె ఉపయోగించుకున్న గడియారం మందగమనానికి అలవాటుపడిపోయింది గావచ్చుననీ సుందరరావు అనుకున్నాడు.

టిఫిను తినకుండా దిక్కులు చూస్తున్న సుందరరావుతో పరమశివంగారు "ఏమయ్యా! మేం తినమంటే గానీ తినేట్టు లేవు నువ్వు" అన్నారు. రాజానుగ్రహం కోసం కన్నడరాజ్యంలో పడరాని పాట్లుపడి, వెల్లుల్లి, తిలపిష్టమూ మెసవి రుచులు దోసంబంచు పోనాడుకొన్నాడుకదా, కవిసార్వభౌముడు శ్రీనాథునంతటివాడే; ఇక ఉద్యోగ ప్రాప్తికోసం ప్రయత్నిస్తున్న తాను పై ఉద్యోగి ప్రీతిపూర్వకంగా తినమంటున్న పకోడీలను వద్దని నిరాకరించడం ఏం బాగుంటుం దనుకుని, సుందరరావు ప్లేటులోనుంచీ ఒక ముక్క తీసుకొని నోట్లో వేసుకొన్నాడు. ఆముక్క నోటిలోనుంచీ అన్నవాళంద్వారా గర్భకోశం చేరుకునేసరికి రెండుమూడుసార్లు డోకు రాబోయిం దతనికి. కానీ ఎంతో బలవంతాన నిగ్రహించుకొని అతడు "భగవంతుడా! నేను

తెలిసో తెలియకో ఎన్నో పాప కార్యాలు చేసివుండవచ్చు. వాటికి నువ్వే శిక్ష విధించినా సరే, నేను మాటాడకుండా అనుభవిస్తాను. ఐతే తినరాని వస్తువును తప్పనిసరిగా తినితీరవలసిన విపరీత, విషమ విపత్కర పరిస్థితిని మాత్రం కలగజేయకు ప్రభూ" అని పరాత్పరుణ్ణి ప్రార్థించుకున్నాడు.

తన ప్రక్కన కూచొనివున్న యువకుడు ఆ పకోడీలను వెన్న బిస్కత్తుల్లా అప్యాయంగా తినేస్తుండడం చూచి సుందరరావు మరింత ఆశ్చర్య పడ్డాడు. కారణాంతరాలవల్ల అతని జిహ్వ రుచి భేదాల కతీతమై, ఒక నిర్వికారమైనస్థితిలో వుండవచ్చుననీ, లేకుంటే ఒక మానవ మాత్రుడి జిహ్వకు అంతటిచేదైన పదార్థాన్ని రుచి చూడగల సహనం వుండజాలదనీ సుందరరావు భావించాడు.

ప్లేటు ఖాళీచేసేసి కూచున్న అరవ ఆసామిని చూస్తూ పరమశివంగారు "ఎలా వున్నాయ్ పకోడీలు?" అని ప్రశ్నించారు. అతడు చిరునవ్వును ఒలకబోసి "మద్రాసులో విజయాలంచ్ హోమ్ అని ఒరు హోటలు వున్నదండీ! అందులో పకోడీలు బహు అరిమిగా చేస్తురు. కానీ అవి కూడా ఈపకోడీలముందు తీసికట్టుదా" అన్నాడు. ఆమాటలువిని పరమశివంగారు పరమానందభరితులై తన జీవితకాలంలో తాను తిన్నన్ని పకోడీలు మరొక మానవుడు తినలేడని చెప్పి, ఆ పకోడీలు చేయడంలో వివిధప్రాంతాలవారు అవలంబించే వేర్వేరు పద్ధతుల్ని గురించి ఒక లెక్చరు కొడుతున్న సమయంలో, సుందరరావు తన ప్లేటులోని పకోడీలనన్నిటినీ తన పాంటు జేబీలోనికి చేరవేసి, గుక్కెడు మంచినీళ్లు త్రాగి, సదరు లెక్చరును సావధాన చిత్తుడై వినసాగేడు.

హాల్లోవున్న గడియారం టంగు టంగుమని ఏడుసార్లు మ్రోగింది. గంటమ్రోత వినబడగానే లెక్చరు నిలిపివేయడం హెడ్మాస్టరుగారి వాడుక కాబట్టి, అంతటితో ఆయన పకోడీల ప్రిపరేషన్లోని వివిధ విధానాలను టచ్ చేయడం ఆపి, "ఇకమీరు వెళ్ళండి. త్వరగానే మీలో ఎవరికైనా ఒక్కరికి ఆర్డరు వస్తుంది" అన్నారు. ఉద్యోగార్థు లిద్దరూ ఒక్కసారే థేంక్స్ చెప్పి అక్కడినుంచీ నిష్క్రమించారు.

వారు వెళ్ళినతర్వాత పరమశివంగారు భగవద్గీతాపఠనం కానిచ్చుకొని, భోజనానికి కూచున్నారు. ఆయనభార్య అన్నం వడ్డిస్తూ "ఏమండీ! ఉద్యోగం వాళ్లల్లో ఎవరికి వ్వాలనుకుంటున్నారు?" అని ప్రశ్నించింది.

"దాంతో నీకేం పని!" అన్నారు పరమశివంగారు.

"అదికాదండీ మీరాగోడప్రక్కన కూచున్న అబ్బాయిని చూచారుగా! బాగా చదువుకున్నాడు. అందంలోకూడా కొఱత లేదు. మన సరళకూ, అతనికీ ఈడూ, జోడూ..." అంటూ గుణిసిందామె.

"ఓహో, అదా నీ ఉద్దేశం? సరళకూ, నీకూ ఎవడిష్టమైతే నాకూ వాడే ఇష్టం. ఆమె పెళ్లివిషయంలో నాజోక్యమెంత మాత్రమూ వుండదు. మరి ఈ ఉద్యోగవిషయంలో మాత్రం నువ్వు నీ అభిప్రాయాల్ని నాతో చెప్పకు. బీయస్సీవాడికంటే బీయస్సీ ఆనర్స్ చదివినవాడు విద్యాధికుడు కాబట్టి, ఈ ఉద్యోగం ఆ అరవ ఆసామికే ఇవ్వవలసిందిగా నేను మేనేజరుగారికి సిఫారసు చేయబోతున్నాను" అన్నారు హెడ్మాస్టరుగారు.

"అరవవాడు తెలుగులో ఏం పాఠం

# ★ ముదితల్ నేర్వగరాని విద్య ★

"చెప్పగలరండీ?" అని అడ్డుప్రశ్న వేసింది ముసలావిడ.

పరమశివంగారు కొంతసేపు యోచించి "ఎందుకు చెప్పలేను! చెప్పగా, చెప్పగా తెలుగు తనంతటదే వచ్చేస్తుంది." అన్నారు.

* * *

ఒకొకప్పుడు మానవుడు కలలోనైనా అనుకోలేని విధంగా కొన్ని సంఘటనలు జరిగిపోతుంటాయ్. అజేయమైన హిమగిరి శిఖరాన్ని మానవమాత్రుడొకడు జయించడం అలాటి సంఘటనే కావచ్చు. సుందరరావుకు వివేకానంద హైస్కూల్లో ఉద్యోగం లభించడం అంతటి అద్భుతమైన సంఘటన గాకపోయినా, అతనికి మాత్రం అది అత్యంతాశ్చర్యాన్ని గలిగించింది.

ఆర్డరు చేతికందిననాటి సాయంత్రమే అతడు హెడ్మాస్టరుగారిని ఆఫీసు రూములో కలుసుకొని తన కృతజ్ఞతను తెలుపుకొన్నాడు.

"నీకు ఉద్యోగం లభించడంలో నువ్వెంత మాత్రమూ నాకు కృతజ్ఞత చూపవలసిన అవసరంలేదు. నేనేమో ఆరోజు నీతోబాటు నాదగ్గరికి వచ్చిన మనిషికే ఉద్యోగం ఇవ్వవలసిందిగా పైవాళ్లకు సిఫారసు చేశాను. వాళ్లుకూడా నామాట తోసివేయలేదు. కానీ ఇచ్చిన ఉద్యోగాన్ని నిరాకరిస్తూ అతడు నాకు జాబు వ్రాశాడు. ఇరవై రోజులనుంచీ అతడు ఆరీతీరని కడుపునొప్పితో బాధపడుతూ హాస్పటల్లో వున్నాడట" అన్నారు పరమశివంగారు.

"అయ్యయ్యో! అతని కెందుకు వచ్చిందండీ కడుపునొప్పి?" అని ప్రశ్నించాడు సుందరరావు. ప్రశ్నలకు సరైన సమాధానం చెప్పే అలవాటు లేదు పరమశివంగారికి. ఆయన "ఎందుకొస్తే నీకేమయ్యా! నీక్కావలసిందేమిటి? ఉద్యోగం. అది నీకు దొరికింది. నువ్వు రేపేవచ్చి డ్యూటీలో జాయినైపో" అన్నారు.

పదిరోజుల తర్వాత ఒకనాడు పరమశివంగారు సుందరరావును ఆఫీసు రూముకు పిలిపించి "మీ నాన్నగారి అడ్రసు ఏమిటి?" అని అడిగారు. "ఆయనతో మీకేం పనండీ?" అని అడగాలనుకున్నాడు సుందరరావు. కానీ హెడ్మాస్టరుగారి దగ్గర వీలైనంత వినయంగా ప్రవర్తించడమే మంచి టీచరుయొక్క ముఖ్యలక్షణమని గుర్తెరిగి వున్నాడు గనుక, తన తండ్రిగారి చిరునామా మాత్రం చెప్పి అక్కడినుంచీ బయటికి వచ్చేశాడు.

రెండువారాల అనంతరం మళ్ళీ పరమశివంగారు సుందరరావును పిలిపించి "మీ నాన్నగారు నాకు ఉత్తరం వ్రాశారు. నీ పెళ్ళినిగురించి మీవాళ్లెవరుగానీ ఇంతవరకూ ఎట్టి నిర్ణయమూ చేసుకోలేదట. నువ్వా రోజున మా అమ్మాయిని చూచేవున్నావ్. నీ అభిప్రాయమేమిటి?" అన్నారు.

సుందరరావు తలమీద పిడుగు పడ్డట్టయింది. హఠాత్తుగా ఒక బోనులో బంధింపబడినట్లు అతడు భావించుకొని, తటాలున దానిలోనుంచీ ఏలాగైనా బయటపడాలని "మీరు మరేమీ అనుకోగూడదండీ. నేను మీఅమ్మాయికి తగినవాణ్ణికాను" అన్నాడు.

"అవునవును. ఆ సంగతి నాక్కూడా తెలుసు. ఐతే సుందరరావ్! ఈవిషయంలో నువ్వూ, నేనూ ఏం చేయగలమో చెప్పు. మన కెంత నచ్చకపోయినా పైవాళ్ల ఉత్తర్వుల్ని మారుమాటాడకుండా ఒప్పుకు తీరాలిగదా! ఈ పెళ్లిళ్ల విషయంలో ఆడవాళ్ళు మగవాళ్ళకు పైఉద్యోగులైరి మరి!" అన్నారు పరమశివంగారు.

సుందరరావు రెండుమూడురోజులాలోచించాడు. ఆలోచించనూ, ఆలోచించనూ సరళను పెళ్ళిజేసుకుంటే మరేమంత కొంప మునిగిపోయేంతటి ప్రమాదమేదీ సంభవించదని అతడనుకోసాగేడు. ఆడవాళ్లకు వ్యతిరేకంగా పురుషులెంతటి బలీయమైన అభిప్రాయాల్ని ఏర్పరచుకొన్నా, అవి తత్క్షణానికి సడలి దుర్బలమైపోవడం సహజమేగా మరి!

అదీగాక సినిమాల్లో, నవలల్లో కథానాయకుల్లాగా సుందరరావు పెళ్ళిగాకముందే తనకు తగిన అమ్మాయి నొకదాన్ని చూచుకొని, ఆమెని తక్షణ ప్రేమించేయలేదు.

దానా, దీనా అతడు పరిస్థితుల ప్రాబల్యానికి లోబడిపోయి సరళను పెళ్ళాడడానికి ఒప్పుకున్నాడు.

ఒక శుభముహూర్తాన పెళ్ళి జరిగిపోయింది.

పెళ్లై ఒక నెల గడచిపోయిన తర్వాత ఒకరోజు సాయంత్రం సుందరరావు స్కూలునుంచీ ఇంటికి వచ్చి మేడపైన, హాల్లో సరళకోసం వెదకి ఆమె కనబడక పోయినందువల్ల ముసలావిడను "ఎక్కడత్తయ్యా సరళ?" అని అడిగాడు. "ఇక్కడున్నాను" అన్నది సరళ వంటింట్లోనుంచీ. "నువ్వు కాలీఫ్లవర్ పకోడీలు చేయడం లేదుగదా కొంపదీసి" అంటూ సుందరరావు అక్కడికి వెళ్ళాడు. సరళ చేస్తున్నది అదే పని!

పొయిలో కట్టెలు భగభగ మండుతున్నాయ్. బాణలిలో నూనె సలసలా కాగుతోంది. పకోడీలు బుసబుస పొంగుతున్నాయ్. సరళ ముఖంపైనుంచీ చెమట బిందువులు జలజల రాలుతున్నాయ్!

సుందరరావుకు తనతల్లి వంటచేస్తుంటే, ఆమెదగ్గర కూచుని "ఇదేమిటి, అదేమిటి, కూరలో పసుపుపొడి వేయడం ఎందుకు? తిరగబోతలో ఆవాలు వాడడంవల్ల లాభమేమిటి?" ఇలాటి ప్రశ్నలు అడగడం వాడుక. ఆ అలవాటు నతడు ఉన్నట్టుండి పోగొట్టుకోలేక అక్కడున్న ముక్కాలి పీటపై కూచుని "సరళా! ఆపకోడీలు పొంగిపోతున్నా యెందువల్ల?" అని ప్రశ్నించాడు.

సరళ తన భర్తయొక్క అమాయకత్వానికి చిరునవ్వునవ్వి "మరి సోడా కలపడమెందు కనుకుంటున్నారు?" అన్నది.

"సోడా అంటే మనం ఒకణా ఇచ్చి అంగట్లో కొని త్రాగుతామే, అదేకదూ!" అన్నాడు సుందరరావు.

ఈసారి భర్తయొక్క అజ్ఞానానికిచీకాకు పడుతూ సరళ "అది సోడావాటరు కదండీ! ఇది సోడాపిండి. ఇదిగో, ఈ డబ్బాలో వుంది చూడండీ" అంటూ ఆ డబ్బా అతని చేతి కందించింది.

సుందరరావు ఒక చిటిక పిండిని నోట్లో వేసుకొని రుచిచూచి, డబ్బానాలాగే క్రింద వదిలేసి, సరళ చేతులు రెంటినీ పట్టుకొని "సరళా! నువ్వు దయచేసి ఈ ఫలహారం చేయడం మానవూ!" అన్నాడు అతి దీనంగా!

"ఎందుకూ?" అన్నది సరళ దిగ్భ్రమజెంది.

"పాపం, నీకు వంటచేయాలనే కుతూహలం ఎంతైనా వుంది కానీ ఏవిధంగా వండితే మానవులు తినదగిన ఆహారం సిద్ధంకాగలదో నీకు తెలియదు నువ్వీ పకోడీలు చేయడానికి ఉపయోగిస్తున్న సోడా ఆహార పదార్థాల్లోకి పనికివచ్చేదికాదు. ఇది చాకలిసోడా!" అని సుందరరావు అక్కడి నుంచీ వెళ్ళిపోయాడు.

సరళ తోటలో పనిచేసుకొంటున్న నౌఖరును పిలిచి "నేను తెమ్మన్నా సోడా ఏమిటి, నువ్వు తెచ్చినసోడా ఏమిటి?" అని గద్దించింది అతడు చేతులు నులుముకుంటూ "సోడాలో ఎన్నిరకాలున్నాయో, నాకేం తెలుసునండమ్మగారూ! అంగడివాడిచ్చింది నేను తెచ్చాను. రెండు నెల్లకు ముందొకసారి మీరు తెమ్మన్నప్పుడు కూడా నేనిదే తెచ్చానండీ" అన్నాడు. ★

అనువాదం
నండూరి రామమోహనరావు

# జారిన తెర

కిటికీ పక్కనే వున్న పరుపుమీద పడుకున్న విశ్వం వీపుమీద ఒక్క చరుపు చరిచి లేపింది అలమారులోని గడియారం అలారం చిరాగ్గా పరుపుమీద ఒత్తిగిల్లాడు. అతని చెయ్యి పక్కనే వున్న అలమారు రెక్క తెరిచి అలారాన్ని చటుక్కున ఆపింది. ఓ అయిదు నిమిషాలు మళ్ళీ కునుకు తీసేటప్పటికి అరుగుమీద, మంగలిరంగడి సన్నాయి స్వరం పరిగెట్టుకుంటూ వొచ్చి అతని చెవిలో మ్రోగింది.

నెమ్మదిగా సన్నాయి స్వరంతో డోళ్ల చప్పుళ్ళు జత కలిపాయి. స్నానాల గదుల్లోంచి బిందెల చప్పుళ్ళూ, ఆడాళ్ళ గొడవలూ అతనికి వినిపించాయి. విశ్వం పడుకున్న గది తప్ప తక్కిన మేడంతా మేలుకుంది. పక్క వసారాలో నడుస్తూన్న మనుషుల అడుగుల చప్పుళ్ళూ అరుగుమీది భజంత్రీలశబ్దాలూ అతని నిద్రను పాడు చేస్తున్నాయి. మనసులో తన నిద్దర్ని పాడు చేస్తూన్న వాళ్లని తిట్టి పోసులు పెట్టి విసుక్కుని నిస్సహాయంగా కళ్లువిప్పి విశ్వం ఒకసారి గదిఅంతా కలియచూశాడు

కిటికీ రెక్కలని ఆడిస్తో సన్నటి చల్లటి గాలి వీస్తోంది. మినుకు మినుకుమనే నక్షత్రాలు ఆకాశంలో మెరుస్తున్నాయి. మేడ కిటికీలోంచి దూరంగా దొడ్లో ఉత్తరం వేపున వున్న వేపచెట్టు చాలా అందంగా కనిపిస్తోంది. విశ్వం కాస్త ఒరిగి అయినయ్యాక లేద్దామనుకున్నాడుగాని ఈలోపులోనే తన గది తలుపుదగ్గిర ఒక స్త్రీ మెల్లిగా సన్నటి గొంతుకతో మృదువుగా "ఏమండీ! లేవండీ! పెళ్లివేళకు మీరిలాగే నిద్దరోతూంటారు గామోసు" అని అనడం గమనించాడు. ఆ తియ్యటి గొంతుక్కి సమాధానం ఇవ్వకపోతే ఈ పెళ్లిగొడవల్లో కనీసం తనకి కాఫీయేనా ఇచ్చే దాతా దూతా కనపడరని తెలుసుకున్నవాడు గనక చిరాగ్గానే విసుక్కుంటూ కళ్లు నులుముకుంటూ తలుపు తీసి "అబ్బా! పొద్దున్నే ఎనిమిదింటికి పెళ్ళైతే మా మరదలుపిల్ల నన్ను ఇప్పణ్ణించీ లేపెయ్యమని నీకు ఆర్డరిచ్చిందా జానకీ" అన్నాడు ఒళ్లు విరుచుకుంటూ.

"ఆ! వేళాకోళాలకేంగాని లేచి మొహంకడుక్కోండి ఎవరేనా చూస్తే నవ్విపోతారు" అని జానకి సన్నగా మెల్లిగా అదృశ్యమైంది.

అరుగుమీద కూచుని సన్నాయి స్వరాన్ని ఎక్స్పెరిమెంటు చేస్తోన్న రంగడి మూలాన్న విశ్వానికి నిద్దర మీద ఇక ఆశ పూర్తిగా సన్నగిలింది. అంచేత అతను తనకా రోజు నిద్రపోయే యోగం లేదని ఒళ్ళు విరుచుకుంటూ మిగిలిన కిటికీ రెక్కలుకూడా తెరిచాడు. తూర్పుగా ఎదురుగుండావున్న మొగపెళ్ళివారి విడిది మేడ తెల్లని వెల్లగోడల్తో ఆచీకటిలో మనోహరంగా మెరిసిపోతోంది విశ్వం రెప్పలు వాల్చకుండా ఆ మేడనీ ఆకాశాన్నీ, చీకటినీ చెట్లనీ పెళ్ళివారినీ చూస్తూ నిలబడిపోయాడు.

## శ్రీ వీరుభొట్ల సత్యనారాయణమూర్తి

కొంతసేపయ్యాక విశ్వం మేడ కిటికీ పక్కకి ఒక్క కుర్చీని ఈడ్చుకుని దాంట్లో కూలబడ్డాడు. అక్కణ్ణించి చూస్తే పెళ్ళి జరగబోయే పందిరీ, అక్కడ కూచున్న భజంత్రీలూ, పెళ్లిపీటలూ, తోరణాలూ, అన్నీ కనిపిస్తున్నాయి పెళ్లి జరిగేచోట నిద్దర్లు మాని వుత్సాహంగా ముగ్గులు పెడుతూన్న ఎనిమిదేళ్ళపిల్లల్ని చూసి ఆశ్చర్యపోయాడు విశ్వం. విడిది మేడకూడా సందడిగానే వుంది. మొత్తం పెళ్లివారందరూ సంతోషంలో మునిగివున్నారు. ఎనిమిదింటికి పెళ్ళి వైభవంగా జరగబోతోంది.

విశ్వం అలా వెర్రిగా కూచుని కిటికీలోంచి అర్థరహితమైన దృష్టిని ఆకాశం వేపు నిలిపిచూస్తూంటే జానకి వొచ్చి "అలా కిందకెళ్ళి ముఖం కడుక్కురండి మీ కెందుకూ? నాలుగయ్యేసరికి గప్ చిప్‌గా కాఫీ కాచిచ్చేస్తాను" అని ముసి ముసిగా నవ్వి పక్షిలా పారిపోయింది ఆకళ్లలో చిందులు తొక్కుతూన్న స్వాభిమానం, అమాయకత్వం, ఆనందం చూస్తూ విశ్వం అలాగే కదలకుండా కూచున్నాడు

విశ్వం గదిలోంచి లేచి వెళ్లి కాలకృత్యాలు ముగించుకుని మళ్ళీ గదిలోకి వచ్చేసరికి జానకి సొంతంగా ప్రత్యేకంగా తయారుచేసిన టిఫినూ కాఫీ పట్టుకునివచ్చి బల్లమీద పెట్టి తినండని చెప్పింది ఫలహారం తిని కొత్త బట్టలుకట్టుకుని విశ్వం ఆకిటికీదగ్గిరే బల్లమీద కూలబడ్డాడు అందరూ సంతోషంలో మునిగి గంతులేస్తూ పెళ్లి పనులు కానిస్తున్నారు. నిద్దరోతూన్న పదమూడేళ్ల అమాయకపు వరలక్ష్మిని నిద్దర్లోంచి లేపి "పెళ్ళికూతురుగారూ? ముసుముకుని పడుకుంటే పెళ్లవుతుందా? పెళ్ళికి నువ్వూ కష్టపడాలమ్మాయ్" అంటూ ఎగతాళి చేస్తున్నారు కొందరమ్మాయిలు

విశ్వంమాత్రం తను ఎంత వుత్సాహంతో పెళ్లికి వచ్చాడో ఎన్ని ఆలోచనలు బుర్రలో పేర్చుకుని వచ్చాడో, అంత వుత్సాహమూ ఇప్పుడు చూపలేకపోతున్నాడు వెలుగును మింగిన చీకటిని చూస్తూ అలా ఆలోచనల్లో తేలిపోతున్నాడు అలమారులోని గడియారం అయిదు గంటల్ని చూపుతోంది క్రమంగా చీకటిని ఛేదిస్తూ మసకమసకగా వెలుగు ప్రవేశిస్తోంది చెట్లమీద పక్షులు పిచపిచలాడుతూ కిచకిచమంటున్నై జనం మేలుకుని రోడ్లమీద సందడిగా తిరగడం మొదలెట్టారు. విశ్వానికి మాత్రం ఆ వేళ చలి వేస్తూన్నట్లనిపించి 'ఉలెన్ స్వెట్టర్' పెట్లోంచి తీసి తొడుక్కుని బల్లమీద కూచుని సూర్యోదయసౌందర్యం చూస్తున్నాడు. చిన్ననాటి పెళ్లిరోజులు విశ్వం హృదయంలో మెరిసినై ఆ సంఘటనలూ, తన చిలిపితనం, తెల్లారగట్ల చలిలో తలంటిపోసుకోడానికి పెళ్లిరోజున తను పెట్టిన పేచీలూ, పద్నాలుగోయేట కాలు పెట్టిన తాను పెళ్లంటే పల్లకిలో దర్జాగా ఊరేగడమే అని అనుకోవడం, పెళ్లి తన భుజంమీద మోయలేని బరువు సంగతి తెలీని ఆ అజ్ఞానదశా, అతని కళ్లకి కట్టినట్లైంది

క్రమంగా చీకటి తెరల్లోంచి సిగ్గుతో సూర్యుడు తొంగితొంగి చూస్తున్నాడు. వెచ్చగా కోటు తొడుక్కుని విశ్వం అలా ఊరి బైటకు వెళ్ళేడు సూర్యోదయ కాంతిలో వరిచేలు వయ్యారంగా, సిగ్గుగా, ఒంగుతున్నాయి విశ్వం అలా కాలవగట్టుక్కేసి నడుస్తున్నాడు అక్కడ గుడిసెల్లోంచి మానవుల నీడలా ఒక

మిక్కిలి అస్పష్టమైన ధ్వని అతని చెవులదగ్గిరికి వచ్చి దాన్ని భావరూపంలో మెదడుకు అందివ్వసాగింది. మొదట విశ్వం ఆ ధ్వని గురించి అంత శ్రద్ధ తీసుకోలేదు. కాని క్రమక్రమంగా ఆ ధ్వని పెద్దదై ప్రతి ఇంటి దగ్గిర కనిపించిన ప్రతిమనిషిదగ్గిరా గుసగుస రూపంలో పైకి వస్తూండడం చూసిన విశ్వం కాళ్ళు అకస్మాత్తుగా తడబడ్డాయి. మీటిన ఫిడేలుతీగలా శరీరం కంపించింది. నుదుటిమీద చిరుచెమట బిందువు లంకురించి క్షణమాత్రం జాలిగా నిలబడి నేలమీద రాలుతున్నై. మొహం ఎర్రబడింది.

సుమారు రెండు మైళ్ళ దూరం దాకా పాకిన ఈవార్త పెళ్ళివారికి తెలియకపోవడం చూసేసరికి విశ్వం ఆశ్చర్యపోయాడు. ఆ భయంకరమైన వార్త విని అతను నిలువునా నీరైపోయాడు. వరలక్ష్మి భర్తగురించి ఏవో అస్పష్టభావాలను అందిస్తోన్న ఆ గుసగుస ధ్వనుల వెనుకనున్న నిజాయితీకోసం అతని మనస్సు ఆరాటపడసాగింది. రెక్కలుకట్టుకుని పరిగెట్టుకుంటూ వచ్చి వాలాడు ఇంటిలోకి. అక్కడ అడావిడిగా పెళ్ళి ఏర్పాట్లైపోతున్నై. బరకాలు పరిచేశారు. భజంత్రీలు తయారుగా నాద్య పరికరాలతో సిద్ధంగా వున్నారు. విశ్వం గుండె వొణకుతున్నది.

అడుగులో అడుగులేసుకుంటూ, వొణికే స్వరంతో జానకిని గది లోపలికి పిలిచి తలుపుగడియవేసి "రాజారావు గురించి అందరూ ఏమనుకుంటున్నారో తెలుసా" అన్నాడు, ఆమె ముఖభంగిమలోని మార్పును గమనిద్దామనే ఆతృతతో ఆమె ముఖంలోకి భయంగా చూస్తూ.

"ఏమనుకుంటున్నారు?"

"అతనికి మూర్ఛట"

జానకి మొహమంతటా ఎరుపుదనం ఆవరించింది. ఆమెముఖభంగిమలు క్షణక్షణానికీ మారిపోతున్నాయి. ఆమెకళ్ళల్లో ఏదో ఆకస్మిక ప్రశ్నాభావం, ఆతురత, భయం, ఆవేదనా ప్రస్ఫుటంగా అతను చదువగలిగాడు.

రెండు నిమిషాలసేపు అతని ముఖంలోకి సూటిగా భయంగా చూస్తూ ఆమె మౌనం ధరించింది.

తరువాత బరువుగా లేచి నిలబడి మెల్లని స్వరంతో "ఏమీ తెలియనట్టు వూరుకోండి. మనకెందుకు? లేనిపోని గొడవ. నాన్నతో చెప్తే నిప్పులు కక్కుతాడు. పెళ్ళిలో నిప్పులుపోసిన వాళ్ళమవుతాం-చెప్పకపోతే చేతులారా చెల్లెలికి వురిపోస్తున్నామనే భయంగా కూడావుంది." అంది.

ఐదు నిమిషాలతర్వాత ఆమె వుండబట్టలేక వెళ్ళి సుబ్బరామయ్యగారి చెవిలో భయంగా చెప్పింది. ఆయనకళ్ళు ఎర్రగా కాలిన ఇనపకమ్మెలు అయిపోయాయి. క్రమంగా ఈ వార్త అంటువ్యాధిలా ఆనోటా ఆనోటా అందరికీ తెలిసింది. మొగపెళ్ళివారుకూడా కిందా మీదాపడే ప్రాణాలు అరచేతిలో పెట్టుకున్నారు.

క్షణమాత్రం ప్రళయరుద్రరూపం తాల్చిన సుబ్బరామయ్య హృదయంలో అనేక ప్రశ్నలూ సమాధానాలూ ఉదయించాయి. క్రమంగా ఆయనమనస్సు కుదుటపడ్డది. ఎక్కడో మూలకూచున్న పెళ్ళికూతురు చెవిని యీమాటపడింది.

మేడగదిలో కూచున్న విశ్వం నిశ్చే



"ఓ అమ్మాయి రోడ్డుమధ్యపడిపోయింది. కాళ్లు, చేతులు తప తప కొట్టుకొంటోంది."

ఆమె పరిశుభ్రమైన బట్టలు కట్టుకుంది. చక్కగా తల దువ్వుకుని బొట్టు పెట్టుకుంది. ఇంచుమించు పదహారు పదిహేడేళ్ళుండొచ్చు. చేతులకి గాజులున్నాయి. మెడమాత్రం బోసిగానే వుంది. ఒక సామాన్య సంసారి కుమార్తె అనుకున్నాడు విశ్వం. చేతులు గట్టిగా కొట్టుకుంటూండడం చేత, గిజాయించుతూ అటూయిటూ దొర్లిపోతూండడంచేత గాయాలు తీవ్రంగా తగిలాయ్.

ఈ దృశ్యాన్ని చూడగానే విశ్వం భయంతో లోలోపల వొణికాడు. పుట్టినప్పణ్ణించీ పల్లెటూర్లో చదువుకున్నాడు గాని ఇటువంటి దృశ్యం అతను చూళ్లేదు. ఎంచేతో ఆమె అలా కొట్టుకుంటోందో



# జారిన తెర



తెలీలేదతని కప్పుడు. భయంతో పాలిపోయిన ముఖంతో గుడ్లప్పగించి నిర్ఘాంతపోయి అలా కొయ్యబారి చూస్తున్నాడు.

అదృష్టవశాత్తూ ఇది మెయిన్ రోడ్డు ప్రక్కగావున్న వీధిలోకనక జన సమ్మర్దనేం అక్కడ హెచ్చుగాలేదు. చుట్టూ మూగిన జనులు మాత్రం నాలికలు కరుచుకుంటూ 'అయ్యో! పాపం' అంటూ ఏదో వాళ్లలో వాళ్లు గొణుక్కుంటున్నారు. కాని విశ్వానికి అది ఒక మూగభావంగా పక్షిభావంగా తోచింది. గట్టిగా ధైర్యంచేసి ఎవ్వరినీ అడగలేకపోయాడు. హృదయంమాత్రం ఆమె స్థితిని చూసి విచారంతో నిండిపోయింది.



ఈ లోపులో ఇద్దరు ముగ్గురు జంక్షన్ దగ్గిర్నుంచి కుళాయి నీళ్ళు బిందెల్లో తెచ్చి ఆమెమీద దిమ్మరపోశారు. ఎవరో ఇనప తాళం చెవులు ఆమె చేతిలో పెట్టారు. నీటితో తడిసిన ఆమె శరీరం దుస్తులు రోడ్డు బురదకి మరీ పాడైపోయాయి. శిరోజాలు వికృతరూపం దాల్చాయి. నీటితో తడిసిన ఆమె బట్టల్లోంచి ఆమె శరీరం అస్పష్టంగా కనిపించింది.

విశ్వం తెల్లబోయి చూస్తూంటే చుట్టూ వున్న జనంయొక్క ముఖ భంగిమలలో అనేక విచిత్ర పరిణామాలు అతనికి కనిపించాయి. జాలితో నిండిన కళ్ళూ, విచారంతో నిండిన కళ్ళూ, ఆదృశ్యాన్ని చూడగానే ఎందుకో ప్రపంచంమీద అకారణంగా ఏవగింపు జనించిన వ్యక్తులూ, వేదాంతభావం తొంగిచూచే కళ్ళూ, నీచాతినీచ భావాలు వెలువరించే కళ్ళూ, అతని జీవితాంతంవరకూ హృదయంలో ఆరోజున చెరగని ముద్రనువేశాయి.

మొట్టమొదటిసారిగా తనని కదిపేసిన ఆ సంఘటనా, ఆనాటివ్యక్తుల విభిన్న మనస్తత్వాలూ భావాలూ విశ్వం తరువాత జీవితంలో ఎంత మరిచిపోదామని ప్రయత్నించినా మరిచిపోలేకపోయాడు.

అలా నీరు పోయగానే ఆమె మళ్లీ మనుషుల్లో పడింది. క్రమంగా జనం పల్చబడి చెదిరిపోసాగారు. అయినా వెళ్ళిపోకుండా ఆమెకేసి పరీక్షగా చూసే జనం అక్కడ లేరని చెప్పలేం. విశ్వంమాత్రం అక్కణ్ణించి కాలు కదపలేకపోయాడు. ఆమె మాత్రం జరిగినది గ్రహించి సిగ్గుతో తల వొంచుకుని నేలపైచూపులు నిగిడ్చి నిలుచుంది. ఇంతలో ఏ కళనుందో కాని ఎదురింటి ఎత్తు అరుగుల ఇంటావిడ ఆ అమ్మాయిని లోపలికి పిలిచి పనిమనిషి చేత శరీరం తుడిపించి ఒక తెల్లపాడిచీర ఆమెకిచ్చి కట్టుకోమని చెప్పింది.

ఈసారి జనం చీలిపోయారు. విశ్వం కాళ్ళు మాత్రం ఆ చోటుని వదల్లేదు. మూణ్ణెల్లనించి అతను ఆ వూళ్ళో పని చేస్తూన్నా ఆ అమ్మాయిని ఎక్కడా చూసినట్టు జ్ఞాపకంలేదు. ఆ భయంకర పరిస్థితి చూసిన తర్వాత విశ్వం తన మనస్సుని కుదుటపరుచుకోలేకపోయాడు. హోటల్లో కెళ్లి కాఫీ తాగి కిటికీలోంచి ఆ ఎత్తుఅరుగుల ఇంటివైపే చూడసాగాడు.

కొద్ది సేపట్లో ఒక ముసలతనూ, అతని వెంటే ఇంకొక యువకుడూ అక్కడికి వచ్చారు. యువకుడు మిలిటరీ దుస్తులు ధరించి వున్నాడు. ముప్పై ఏళ్ళుండొచ్చు. ముసలతను సామాన్య దుస్తులను కట్టుకున్నాడు. వారిద్దరి ముఖాల్లోనూ భయాందోళనలను విశ్వం చూశాడు.

వాళ్ళిద్దరూ ఆ ఇంట్లోకెళ్లి ఆ అమ్మాయిని రిక్షాలో ఎక్కించుకుని హాస్పటలుకి తీసుకువెళ్లిపోయారు.

విశ్వం మనస్సు ఆరాత్రి పరిపరివిధాల పోయింది. చిన్నతనంలో పల్లెటూళ్లో అతను వీధిబళ్ళో చదువుకుంటూన్నప్పుడు ఎప్పుడో ఓరోజున మేష్టారు మూర్ఛగురించి చెప్పినట్టు జ్ఞాపకం. ఆవేళ ఆజబ్బుగురించి మాష్టారు చెప్తూంటే అతనికి ఎంతో భయంవేసింది. ఇంటికొచ్చి అమ్మని ఆరోగం గురించి పిచ్చి పిచ్చి ప్రశ్నలు వేశాడు. ఆవిడ విసుక్కుని తగిన సమాధానాలు చెప్పలేకపోయింది. ఆ సాయంత్రం ఆ అమ్మాయి అలా నిర్జీవంగాచూస్తూ కాళ్లూ చేతులూ దబదబ బాదుకుంటూ కొట్టుకుంటూండడం చూడగానే విశ్వం భయంతో ఒణికిపోయాడు. రాత్రి అతనికి నిద్దర పట్టలేదు. ఆ అమ్మాయిని గురించీ ఆ వ్యాధిని గురించీ అలా ఆలోచించసాగాడు. ఆ అమ్మాయిపై అతనికి చెప్పలేనంత జాలి వేసింది.

ముడతలుపడ్డ ముఖంతో ఆత్రుతతో వచ్చిన ముసలాణ్ణి చూసీ చూడగానే విశ్వం హృదయం జాలితో నిండిపోయింది. మాసికలు వేసిన అతని చొక్కా, వెలవెలపారిన ఆ ముసలతని ముఖం చూడగానే తన ఆత్మీయుల కెవరికో తీరని ఆపద సంభవించినట్టు విశ్వం బాధపడ్డాడు. ఏ పుస్తకంలోనో అతను చదివినట్టు జ్ఞాపకం, కొన్ని వ్యాధులు నయం చేయబడలేవనీ అందులో మూర్ఛ ఒకటనీ. అమర్నాడు తన తోటిగుమాస్తాలతో ఆ వ్యాధి గురించి చర్చించి తృప్తికరమైన సమాధానం పొందలేక ఇంటికి బయల్దేరాడు.

హోటల్దగ్గిర మాత్రం శరీరం ఏదో అవ్యక్తభయంతో వొణికినట్టైంది. బరువెక్కిన గుండెతో అతనుఆవేళ ఇల్లుచేరుకున్నాడు. ఆరాత్రికూడా అతను ఆ సంఘటనల గురించి ఏవేవో పీడకలలుకంటూ రాత్రి గడిపాడు.

ఓరోజున తెలతెలవారుతూండగానే లేచి కాలకృత్యాలు తీర్చుకున్నాక విశ్వంకి అలా ఆ అమ్మాయి వుంటూన్న సందువేపు వెళ్దామని బుద్ధి పుట్టింది. అనుకోవడమే తడవుగా అప్రయత్నంగా అతని కాళ్లక్కడికి లాక్కెళ్ళై. ఓరాత్రి గుర్తుపట్టిన ఆయిల్లు విశ్వం మర్చిపోలేదు. అప్పటికి పగలు ఏడు గంటలు కావచ్చు. ఆ పెంకుటింటి కెదురుగా ఒక చిన్న హోటలుంది. ఎప్పుడూ

విశ్వం ఆ హోటలుకి వెళ్ళే అలవాటున్న వాడు కాడు. అయినా ఆరోజున దాన్లోకి వెళ్ళి ఫలహారం తీసుకుని కిటికీలోంచి బైటికి దీర్ఘంగా ఆలోచనా పూర్వకంగా చూస్తున్నాడు.

మనస్సులో బయలుదేరిన ఆలోచనలు అనేక విషయాలగురించి అలా సాగిపోతూనే వున్నాయి. ఇంతట్లో పెంకుటింటి సావిట్లో ఏదో చప్పుడైనట్టు అతనికి వినవచ్చింది. ఆలోచిస్తున్నవాడల్లా ఒకసారి త్రుళ్ళిపడ్డాడు. కంగారుగా విశ్వం కుర్చీ మీంచి లేచాడు. అప్పటికే ఆ శబ్దం విన్న జనంలో చాలామంది ఆ యింట్లోకి పరిగెట్టుకుంటూ వెళ్ళారు. పక్కనే వున్న కర్రలకొట్లోంచి ముసలాడు ఏడుస్తూ చక్కా వచ్చాడు.

కాంతమ్మ నూతిదగ్గిర్నించి నీళ్లు తెస్తూ సావిట్లో ఒక్కసారిగా విరుచుకు పడిపోయింది. కుండ నేలబడి ఛిన్నాభిన్నమైపోయింది. గట్టిగా అరుస్తూ కాళ్ళూ చేతులూ నేలకేసి బాదుకుంటూ ఆమె అక్కడ మరణ యాతన పడుతోంది. క్షణంలో ప్రాణంపోయేలావున్న ఆముసలాడు ఏడుస్తూ వొచ్చి అక్కడనిలబడి వెర్రిగా ఇటూఅటూ తిరగడం తప్ప ఏమీ చెయ్యలేకపోయాడు విశ్వంమాత్రం తన జేబులోని తాళాలగుత్తి ఆమెచేతులో పెట్టాడు.

కాంతమ్మ తెలివిలోకి రాలేకపోయింది. చివరికి అక్కడున్న జనంలో కొందరు ఆమెపై నీళ్ళు పోశారు. మళ్ళీ తెలివిలోకి వచ్చేసరికి బ్రహ్మ ప్రయత్నం ఐంది. ముసలివాడు అమాయకుడు; అనుభవజ్ఞానంలేని వాడు. ఆ జాలిగుండె మాత్రం కూతురు కోసం తీవ్రంగా స్పందించిపోయింది. నిస్సహాయంగా నిట్టూర్పులు విడుస్తూ అతను జాలిచూపులు చూడ్డంతప్ప, మరేమీ చెయ్యలేకపోయాడు.

కాంతమ్మ నేలపై కొట్టుకుంటూన్న అనుక్షణం విశ్వం తనగుండెలమీదే ఎవరో కొడ్తూన్నట్టు బాధపడసాగాడు. నిర్వచింపలేని ఆమెబాధ చూసి అతని గుండె కరిగిపోయింది. నిస్సహాయంగా చూస్తూన్న ఆ ముసలాణ్ణి జాలిగా చూస్తూ విశ్వం అక్కడ రాతిస్తంభంలా నిలబడిపోయాడు. అక్కడున్న జనం ఎవళ్ళదారిని వాళ్ళు పోయారు. కాని వెళ్తూన్నప్పుడు అవ్యక్తుల నోటివెంట అనేకమాటలు పైకి వచ్చాయి. కొన్ని గుండెని చీల్చేసి బాధించాయి.

మూర్ఛలోంచి తేరుకున్నాక కాంతమ్మ అతనికి కృతజ్ఞత తెలిపింది. ముసలాడు కూడా విశ్వానికి నమస్కారం చెప్పి అతన్ని ఇంట్లో ఓకుర్చీలో కూచోబెట్టి తమ బాధలు వెళ్ళబోసుకున్నాడు.

కాంతమ్మజబ్బు మరీ ఎక్కువైంది. రోజుకి మూడు నాలుగు మాట్లు ఆమె స్మారకం కోల్పోతూండేది. ముసలతను ఇల్లు వొదలకుండా ఇంటి పట్టునే వుంటూ కూతురు అవస్థ చూసి బావురుమనేవాడు. క్రమేపీ ఆ వ్యాధి ముదిరింది.

మొదట రామారావుకి ముసలతను ఉత్తరాలద్వారా కాంతమ్మ పరిస్థితి తెలియజేశేవాడు. మొదట్లో వ్యాధిని నయం చేయించమని అతను డబ్బు పంపించాడు. కాని తర్వాత అతను వుత్తరాలు వ్రాయడమే మానుకున్నాడు. ఎంతమంది డాక్టర్లకో ముసలతను చూపించాడు. కాని కాంతమ్మ వ్యాధి మాత్రం తగ్గుముఖం పట్టలేదు. మొదట్లో కొత్తగా వింతగా కనిపించిన ఆమె జబ్బు ఆ వీధి జనానికంతకూ సుపరిచితమైపోయింది.

తాను సానుభూతితో విన్న విశ్వం

(55—వ పేజీ చూడండి)

ఏకాంకిక:

# పరమపద సోపానాలు

శ్రీ వంగల
వేణుగోపాలాచార్య

ంతులు: ఇదిగో...ఎక్కడా నిన్నే..

భార్య: (లోపలినుంచి) వస్తున్నా రెండు నిమిషాలు

పం. రెండు నిమిషాలు కాదు. రెండు రోజులయినా ఆ కూపంలోంచి యివతల పడవు. నిన్నే నేవ్. యిదిగో

భా: (వచ్చి) యిదిగో మసిచేతులు చూడండి. తోముతున్న గిన్నె వదలి వచ్చాను చెప్పండి.

పం: ఛీ ఎప్పుడు పిలిచినా ముళ్లమీద ఉన్నట్టు రావడం. సావకాశం లేకుండా.. ఆ దాసీముండ ఏమయిందీ

భా యివాళ రానని కబురు పంపింది.

పం: చచ్చాంరా భగవంతుడా అయితే యీ మూడురోజులూ నువ్వే తోముకోవాలన్నమాట

భా: ఇది చెప్పడానికా నన్ను పిలిచారు. అవతల దొడ్లో యింకెడు పని ఉంటే, మీ కేకలు వినలేక వచ్చాను.

పం అవును కాదు మరీ మోటువాడినాయెను. నీ తమ్ముడిల్లాగ, ఆడగొంతు కేసికొని, ఊపిరిలేనివాడిలా మాట్లాడ్డం చేతకాదు మరి.

భా· అదిగో తోంటిమీద అంతే పళ్లు రాలాయట. మధ్య వాడిమీద పడతారెందుకూ. వాడి దారిని వాడేదో స్వతంత్రంగా రెండు ట్యూషన్లతో బతుకుతున్నాడు. మిమ్మల్ని అర్చుమన్నారా... తీర్చుమన్నారా.

పం: మళ్ళీ మొదలయింది సాధింపు. వాడిని నేనేం రావద్దన్నానా. నిక్షేపంలా నౌకరీ చూపిస్తే ససేమిరా నాకు వద్దని వెళ్లిపోయినవాడు కాదూ. అంతకంటే ఎవరేం చేస్తారు. ఒంట్లో దూరి ఉద్యోగం చేయిస్తారేమిటీ.

భా: ఏం చమత్కారంగా మాట్లాడతారండీ చూపించారు ఎల్లాగయితేం ఉద్యోగం నిక్షేపంలా యింటరు ప్యాసయినవాడికి గుమాస్తాగిరయినా కాకుండా, అటెండరీ చేసికోమన్నారుగా. అటెండరీ...

పం· నేనేం తెలివితక్కువగా చెయ్యమనలేదు. అందులో అల్లా ఉంటేనే ఛాన్సు దొరికినపుడు మనవాడిని యిరికించేయచ్చుగదా అని తాత్కాలికంగా చెయ్యమన్నాను.

భా: ఎప్పుడో ఏదో వరగ బెడతారని యివాళనుంచీ వెధవ నౌకరీచెయ్యమంటారుటండీ

పం: కాదు. యివతల కూర్చొని మీవ మేషాలు లెక్కపెట్టమన్నాను. అవునులే. మంచి చెప్పబోతే యిల్లాగే అవుతుంది. పోనీవాడిని కలెక్టరుగిరీ చెయ్యమను. నేనేం వద్దన్నానా.

భా· కలెక్టరే చేస్తాడో జడ్జీయే చేస్తాడో.. వాడి అదృష్టానికి మనం అడ్డు పడగలమా.

పం: అదిగో మాట పట్టేశావ్. వాడి అదృష్టానికి అడ్డు పడగలమని నేను అన్నానా

భా. లేకపోతే కలెకరుగిరీ చెయ్యమంటూ రెందుకండీ హేళన కాకపోతేనూ. అవును. నేనంటే గౌరవం ఉంటే నా వాళ్లంటే గౌరవం వస్తుంది. 'మొగుడు ముండా అంటే ముష్టాడుకూడా ముండా భిక్షుం'అన్నాడుట.

పం అయింది. కృతిమించి రాగాన పడింది. నీకు నేను గౌరవం యివ్వక, వాడ వాడలా 'నా పెళ్లాం గయ్యాళిదని', డప్పుకొడుతున్నానా ..

భా. మీరు కార్యశూరులు. డప్పు ఎందుకు కొడతారూ.

పం: ఆని నీ అయితే నీ తమ్ముడికి యీ ఊళ్ళో ఉద్యోగం రాకపోవడానికి నేను కారణం అంటావు అంతేనా.

భా బూడిదగుమ్మడికాయల దొంగంటే బుజాలు చూసికొన్నాడుట. అల్లా అని నేను అన్నానుటండీ

పం: అయితే నేను బూడిదగుమ్మడికాయలదొంగని కదూ.. నోరిచ్చాడు భగవంతుడు యిష్టమొచ్చినట్లల్లా వాగడానికి.

భా: దొడ్లో పనిచేసికుంటున్న దాన్ని పిలచి దెబ్బలాట మొదలెట్టారేమిటే..... యివాళ ఫస్టుతేదీకాదే.. ...

పం: అదిగో ఫస్టుఅయితే నీతో దెబ్బలాడతానన్నమాట. అవును. జీతం అంతా నీ వాళ్లోపోసి నన్ను చిప్పచేత్తో పుచ్చుకోమంటావు. అల్లా ఎల్లా సాగుతుందీ.

భా: ఎందుకు సాగదూ... పక్కవాటాలో ఉన్న కాంతంగారికి ఆయనజీతం రాగానే బిళ్లకుడుముల్లా ధారపోస్తాడు. ఆయన చేతిలో చిప్ప చూశారా ఎప్పుడయినా.

పం: ఆవిడకేం.. జగజెట్టిలా.. తెలివిగా సంసారాన్ని దిద్దుకొస్తుంది. నీలాగ ఆవాలు పెట్టెలో అర్ధణా దగ్గిరనుంచి, పద్దు పుస్తకంలో పదిరూపాయలనోటుదాకా మరచిపోదు

భా: ఒకళ్లని అనడందగ్గరే తెలివి. మొన్న పాలదానికి పది యివ్వబోయి రెండు పదులుయిచ్చారుగా. యింకా నేనున్నాను గాబట్టి సరిపోయింది. తెలియక యింకా ఎంత పోతోందో.

పం: పోనీ నువ్వు తెలివైనదానివి .. అప్సరసవి. గొప్పదానివి పొద్దున్నే ముఖమైనా కడుక్కోనివ్వకుండా యీ దెబ్బలాటేమిటే.

భా: యిది మరీ బాగుంది. మధ్య నేను దెబ్బలాడానా. పనివేళ, గొంతు అరిగేలా పిలచి.. చేతిని మసికూడా ఎండిపోయింది. అన్నట్టు యివాళ ఆదివారంగావును మీకేం తీరుబడిగా దెబ్బలాడుతారు.. అవతల పోలెడుపనుంది.. వెళ్ళాలి బాబూ.

* * *

భా: అన్నం తినగానే బయలుదేరుతున్నారెక్కడికి. ఆదివారమేగా...ఎండ మండిపోతుంటే ఎక్కడకండీ

పం. అనుకున్నంతా అయింది ఒకటికి రెండుసార్లు ఎక్కడికంటేనేగాని మనసుండబట్టదు గుణాలు .

భా బాగుంది.. యిప్పుడే భోజనమయినది గదా.. కాస్సేపు విశ్రాంతిగా ఉండి వెళ్ళమన్నాను గాని, ఆ ఆదివారపు రాచకార్యం పడిపోవాలని కాదు ... యిదిగో తమల పాకులు.

పం: అబ్బా. ఊఁ యింట్లో సున్నం ఉందా. అయిపోయిందా ..

భా: ఏం విచిత్రమండీ. అవును. ఆ కొట్లో, అడ్డదిడ్డంగా, నానా గడ్డీ వేసి

చుక్కే కల్పి అయితే అప్యాయంగా నోట్లో వేసికుంటారు గానీ...యివిగో నీళ్లు.

పం : వాడు యిల్లా కల్పి కడితే తెలిసి వచ్చేది వాడికి. యింట్లో కాబట్టి...

భా : పడుకుపోతున్నారు...ఏం కాంత మూర్తులండీ ..అన్నట్టు మొన్నటినుంచి మీతో చెప్పాలనుకుంటున్నాను. వింటున్నారా.

పం : వింటున్నాను.

భా . కాంతంగారు యివాళ ఒక చీర బేరం చేశారు. ఎంత బాగుందనుకున్నారు.

పం : ఆ. చాలా బాగుండి ఉంటుంది. వింటున్నాను.

భా : పోయిన దీపావళికి మీ మాట విన్నాను. యీ సంక్రాంతి కయినా... బట్టలకి మహా యిబ్బందిగా ఉంది. పెద్దది మరీ అధ్వాన్నంగా ఉంది. ఉన్న తెల్లచీర దాని ఓణీకి, పావడాలకి చింపించాను. ఘాట్లాడకేమిటీ.

పం : వింటున్నాను. ఏముందీ...పాత అప్పులు తీరేలోగా కొత్త అప్పులు చెయ్యాలి.. అప్పులు తీరుస్తూ ఉండాలి. అంతే దాని అర్థం.

భా అసలు జీవితం అంటేనే అదేఅర్థం. ఎన్ని అప్పులు చెయ్యకుండా, ఎన్ని తీర్చకుండా జీవితాలు సాగుతాయండీ...తిండికీ గుడ్డకీ, తీర్చుకోవగ్గ అప్పులు చేసికోకపోతే వేల్లాగ.

పం . అన్నట్టు అమ్మాయి ఏదీ...

భా . పక్క వారింట్లో...పిల్లల కార్యక్రమం వింటోంది.

పం : అమ్మణ్ణిని చూస్తే నాకు గుండెదడ వస్తుంది. యీడువాళ్లందరూ పట్టుపావడలతో తిరుగుతుంటే, దీనికి శుభ్రమయిన పావడ అయినా కొనలేక పోతున్నాను.

భా : చీర చింపించానుగా ... రెండు నెలలదాకా ఫరవాలేదు లెండి.

పం : మరి నీకు కనీసం ఏ వాయిలో లేవద్దూ. అయినవాళ్లని అందల మెక్కించాలని ఆశలు, గోచిలో ముడికయినా చాలని సంపాదన ..ఏమయినా సరే...రేపు నీకో రెండు చీరలూ – దానికి రెండు పావడలూ.. తెస్తాను యిబ్బంది లీల్లాగే ఉంటాయి

భా : ఏమిటి .చిన్నపిల్లాడిలా హైరాణ అయిపోతారు. మనలాంటి చిన్న సంసారాలకి అప్పులు కాకపోతే నిండు సంసారాలకి అవుతాయిటండీ. మనమయినా దుబారాగా చేస్తున్నామా. ఉన్నదాంట్లో తృప్తి, ఆనందం అనుభవించటం నేర్చుకోవాలి లేదు లేదు అనుకుంటూ ఎన్నని అమర్చుకోగలం. ఎన్నని సాధించగలం.

పం . అసలు సర్దిపెట్టుకోడానికే చాలటంలేదు. యింకోలా వచ్చే విధానం కనబడదు.

భా : కనక మనం ఒకపని చేద్దాం. నేనూ అమ్మడూ కాఫీ మానేస్తాము. మీకోసం ఒక కప్పెడుమాత్రం కాచి యిస్తాము. మేము శుభ్రంగా తరవాణీ పెట్టుకొని అలవాటు చేసికుంటాము. ఏమంటారు ?

పం : సరి...యిక చెప్పక్కర్లేదు... నెల నెలా డాక్టరకి ఫీజు పొయ్యాలి గావును.

భా : మరీ బాగుంది. తాతలనాటినుంచీ ఉన్న తరవాణీ మన హాయాంలో నేగా మూలబడింది. ఏం ఫరవాలేదు.

పం: ఐతే నాకుమాత్రం కాఫీ ఎందుకూ ...నేనూ మానేస్తాను. అంతా తరవాణీ తాగుతాం. చవకకి చవక పుష్కలంగా తాగచ్చు.

భా : అదిగో అమ్మడు వస్తోంది....

అమ్మడు : అమ్మా ... మరేనే...రేడియోలో...కాఫీ తాగద్దని చెప్పారమ్మా.

భా : యింకే ... మనం యిక్కడనుకున్నదే, రేడియోలోనూ చెప్పారు. కాక పోతే మన సంపాదనేమిటి ఈ ఖర్చేమిటి.

పం : ఏమిటి నీధోరణి యివాళ విచిత్రంగా పోతోంది.

భా : విచిత్రం ఏమీకాదు. మీ మనస్సులోనూ ఉండేదే. మీరు భయపడి తలుచుకోరు. అంతమాత్రాన అవి దూరమూ పోవు. చూడండి. ముందు అమ్మడి పెళ్లి అవాలి. గొర్రెతోకలా ఎదుగూ బొదుగూ లేని సంసారం అయిపోయింది. కొత్త క్లుప్తంలో క్లుప్తంగా పోవద్దూ. తిండి ఎంత తిన్నా చూసేవాడులేడు. కాని సరియైన బట్టలేకపోతే లోకం దరికి రానివ్వదు.

పం : విజ్ఞానం పోలక బోస్తున్నావు. కాని ఏంలాభం.

భా : ఎందుకు లాభంలేదూ. రేపటి నుంచీ ఒక నియమంగా సాగిపోదాం వీలయినంతవరకు ఖర్చులేనితనంలో సుఖాలు అమర్చుకుందాం.

పం : ఏ ఎన్నికల్లోనో నిన్ను ప్రచారానికి పెట్టుకుంటే అవలీలగా గెలిచి పోతారు. కాని నీమాట వింటుంటే నాకూ నిజమేననిపిస్తోంది. ఆదాయపు హద్దుల్లో నివసించడం చేతగావాలి.

భా : నిజమయిన ముక్క చెప్పారు. పుడక పుడక రాచికొని అడవి తగులబెట్టాయిట. చిట్టిపొట్టి ఖర్చులన్నీ ఎందుకూ పనికిరాని ఒక పెద్ద ఖర్చయి, అవసరమయిన వాటికి అడ్డొచ్చి అప్పులపాలవుతారు.

పంతులు : నిజమే. కనుక నేను యీనాటినుంచి అన్ని చిల్లర ఖర్చులూ మానేస్తున్నాను. నువ్వువేసిన కార్యక్రమమే నా జీవిత పథమవుతుంది. ఈ యింటి సౌభాగ్యమంతా యిక నీ చేతిలో ఉంచాను. నాకేమీ అక్కర్లేదు. పొద్దున్నే యింత తరవాణీ...మధ్యాహ్నం యింత తిండి. రాత్రిభోజనం...చూడు మరి.

భా : యింటిలో మనకి కావలసినవి నూటికి అరవై సామానులు మనమే చేసుకోవచ్చు. యివాళటినుంచి పెత్తనాలు మానేస్తాను. ఏమాత్రం అవకాశం ఉన్నా నూలు తీస్తాను. చవకైన కూరలలో పసందైన పచ్చళ్లు చెయ్యడం నేరుస్తాను. ఉన్నా, లేకపోయినా, మన యిల్లంతా నవ్వుల్లో మునిగి, నిత్యకల్యాణం పచ్చతోరణంగా మారేట్టు చేస్తాను. కాని మనం అంతా నియమబద్ధంగా ఉండాలి :

పం : తప్పకుండా...యివాళనుంచీ మన గృహమేకదా స్వర్గసీమ......



ఓకామె:- (అమ్మకాలవానితో) "ఏమోయ్! నువ్వే కదూ! కిందటివారం వాననూనెలు అమ్మకానికి తెచ్చేవ్! యీమాటు ఏమిటి తెచ్చేవ్!"

అమ్మకాలవాడు:- "ఈ మాటా అండి! నవరాలు తెచ్చానండి"

సా॥ రా॥ వెం॥. రాజేశ్వరరావు. శ్రీకాకుళం.




(గతసంచిక తరువాయి)

మూడో అంకం

కమల భయంతో వణకిపోతూ నరహరి వంక చూస్తుంది. ఏదో అనుమానంతో గది అంతా కలయజూస్తాడు నరహరి. నళిని అతని ప్రతిమాటా వేసే ప్రతిఅడుగూ పరిశీలనగా గమనిస్తుంది.]

నర : రాజా రాలేడీ ?

నళిని : ఇక్కడలేరు.

నర : ఏమిటదంతా తలుపెందుకు గడియ వేశారు ?

నళిని : మా ఏకాంతాని కెవరూ భంగం కలిగించరాదని.

నర : ఏమిటంత రహస్యంగా చర్చించాల్సిన విషయం ?

నళిని : హత్యావిషయమే.

[మోహన్ వరండావాకిట్లోకి వచ్చినుంచుంటాడు. తనకేం పట్టనట్టు జరుగుతున్న సంగతి తనేం ఎరగనట్టు వుంటాడు. తనొచ్చినట్టు వాళ్ళకి తెలియడంకోసం అగ్గిపుల్ల గీచి సిగరెట్ వెలిగించుకుంటాడు.

నరహరి గబుక్కున వెనక్కి తిరిగి చూస్తాడు. అక్కడే నిలదొక్కుకుని నళినితో—]

నర : వ్యర్థ ప్రశ్నలతో నా భార్యని విసిగించడానికి నే నెంతమాత్రం ఒప్పుకోను. అయినా మన కంటే దానికెక్కువేం తెలుసని ?

నళిని : మీరుకూడా నిజంగా అతనే చేశాడంటారా నరహరిగారూ ?

మో : (సిగరెట్ పొగవదుల్తూ) కొస్త నిదానంగా ఆలోచించి చూస్తే అలానే కనిపిస్తోంది నళినీ.

నర : (అయిష్టాన్ని సూచిస్తూ) అవును- అందులో - పాపం - అనుమానం ఏమీ లేదు.

నళిని : నేను—నేనుమాత్రం నమ్మలేను ...సరే!—ఎంత నమ్మకం లేకపోయినా చేయగలిగిందేమీ లేదు ... కాని మీరు గడియ విరగ్గొట్టుకురావడం మటుకు చాలా అఘాయిత్యం.

నర : (కొస్త అదిరిపడి సర్దుకుని) అవును మరి—ఎంత తట్టినా తియ్యకపోయే సరికి రాజారావు ఆత్మహత్య ఏమన్నా చేసుకున్నాడేమోనని భయపడ్డాను.

నళిని : (అదిరిపడి) ఆత్మహత్య ?... ఓ...సరే—వస్తాను.

[వరండాలోకి వెళ్తుంది. మోహన్ కూడా ఆమె ననుసరిస్తాడు తన వెనకాలే తలుపు జేరగిలవేస్తూ. నరహరి ఏదో అనుమానంతో వాళ్ళు వెళ్ళిన వైపే చూస్తాడు. కమలవైపు తిరిగేసరికి అతని ముఖం చాలా గంభీరంగా వుంటుంది].

నర : కమలా!......(ఆమె వినిపించుకున్నదీ లేనిదీ తెలీక) కమలా!

[ఆమె మందకొడిగాతలయెత్తిచూస్తుంది]

ఏమంటోంది ఆ అమ్మాయి ?

కమల : ఆ వుత్తరాన్ని గురించి అడుగుతోంది.

నర : హుం......(ఒక్క క్షణం ఆగి) అయినా నీతో ఏం చెప్పాన్నేను ? నీ గది లోంచి కదిలి ఇవతలికి రావద్దనలేదూ?

[స్వరం కొస్త తగ్గించి ఆమెని పరిశీలించి చూస్తూ—]

నువ్వీ రొంపిలోకి దిగడం నాకేం ఇష్టం లేదు. నా మటుకు నాకే ఆబాల్య ప్రాణస్నేహితుణ్ని వ్యతిరేకించవలసి వచ్చినందుకు చాలా బాధగావుంది. అయినా నువ్వతనికి సహాయం చెయ్యడానికి చెప్పగలిగింది కూడా ఏమీ లేదు...అర్థం అవుతోందా ?

కమల : (నెమ్మదిగా లేస్తూ అతని ముఖంలోకి చూస్తూ) మీ కో సంగతి చెప్తున్నాను—

[వరండా తలుపు తోసుకుని రాజా, మోహన్ వస్తారు. మరి మాటాడకుండా కమల గబగబా భోజనాలగదిలోకి వెళ్ళిపోతుంది. నరహరి ఆమె వెనకాలే అడుగు వేసి, వెనక్కి తిరుగుతాడు].

నర : జరిగిన గొడవకి నేను చాలా విచారిస్తున్నాను రాజారావ్.

[మోహన్ పడమటింటిలోకి వెళ్తాడు]

నీ పరిస్థితే చాలా విషమంగా వుంది.

రాజా : (చాలా తేలిగ్గా) అవును అలానే వుందికదూ! (మేజాదగ్గర కూర్చుంటాడు)

నర : నాకేమాత్రం ఇష్టం లేదు గాని— అవసరమైతే నేనీ రాత్రి ఇక్కడ విన్నదీ కన్నదీ కోర్టులో బోనెక్కి సాక్ష్యం ఇవ్వాల్సివుంటుంది.

రాజా : (ఖాళీ కప్పు తీసుకుంటూ) అవును—ఇస్తావు. ఇవ్వాల్సి ఉంటుంది మరి !

నర : (తనుకూడా మేజాదగ్గర కూర్చుని) అది నావిధి—నాధర్మం అనుకుంటాను.

రాజా : అవునవును. కొన్నికొన్ని పరిస్థితుల్లో అలా అనుకోవాల్సివస్తుంది మరి. తప్పదు.

[ఫ్లాస్కులో టీ కప్పులో పోసుకుంటాడు].

నర : నేనిప్పుడు నీహితైషిగా మాట్లాడుతున్నాను—

రాజా : (తాగటానికెత్తినకప్పు అలానే

ఎత్తిపెట్టి) హీ తైషి! (కప్పందించి) నరహరీ నిజంగా నీకు ఎంతో కృతజ్ఞుణ్ణి!

నర : పోలీసులికి కబురు చెయ్యడం వల్ల మనకేం లాభంలేదు. నిజానికి వాళ్లు రావడమే మంచిదేమో!

రాజా : ఓ!-గృహయజమానిగా నా విధి నేను మరుస్తున్నాను. సారీ, నరహరీ! టీ కొంచెం తాగుతావా?

నర : నో, థాంక్స్.

రాజా : సరే—మరైతే నువ్వేం అనుకోనంటే నేనే తాగుతాను.

[టీ చప్పరిస్తాడు]

నర : నీకు చీమకుట్టినట్లైనా లేదల్లేవుందే!... ఇక్కడ-ఈ గదిలో ఓ మానవుణ్ణి హత్యచేసి రెండుగంటలైనా కాలేదు—ఏమీ జరగనట్టే ప్రవర్తిస్తున్నావ్!

రాజా : ఓ—హత్యజరిగింది ఇక్కడా? ఈ గదిలోనా?...ఇంకా అక్కడే అనుకుంటున్నాను [బైటికి చూపుతాడు. నరహరి లేస్తాడు పెదవి కొరుక్కుంటూ.] కూర్చో నరహరి నదురుబెదురులేని ఈ అఘాయిత్యపు కొలనిని చూసి భయం వేస్తోందా?

[అని చిరునవ్వుతో అంటాడు. నరహరి అతనివంక నో క్షణంమాసి అక్కడేవున్న సోఫాలో కూర్చోబోయి మళ్లీ అటుపక్కవున్న సోఫాకేసి వెళ్తాడు]

ఓ - పోనీ అక్కడే కూర్చో. అక్కడే ఎక్కువ సుఖంగా వుంటుందేమోలే నీకు!

నర : (సిగరెట్ ముట్టించి) నీ పరిస్థితి ఎంత ప్రమాదకరంగావుందో నువ్వు గుర్తించినట్టు లేదు.

రాజా: ఇంతకుముందు మనం ఉరిశిక్షను గురించి మాట్లాడుకున్నాం చూశావ్. తెలివితేటలు గలవాడు హత్యచేసికూడా, అనుమానం తన వైపైనా రాకుండా చెయ్యగలడన్నావు కదూ!...ఇప్పుడు మటుకిప్పుడు చూడు - నా బుద్ధితక్కువ. నేను తమాషా అని ఆ నాటకం ఆడకుండావుంటే హంతకుడింత ధైర్యంచేసి నారాయణ్ని నా రివాల్వరుతో కాల్చి చంపి న్యాయంతో చెలగాట లాడేవాడేనా?

[కప్పు ట్రేలో వుంచుతాడు.]

నర : నామటుకు నాకు నువ్వు నిర్దోషి కనిపించినా, నే చెయ్యగలిగిన సాయం ఏమీలేదని చెప్పటానికి చాలా చింతిస్తున్నాను రాజారావ్!

రాజా : (అతని పక్కకివస్తూ) అవునవును. నా కర్థమయింది. నీవిధి నువ్వు నిర్వర్తించి తీరాలి - తప్పదు. కాని - హంతకుణ్ణి గురించి నేను జాలిపడకుండా వుండలేకపోతున్నాను. చేసిన కొంచెం



హత్యకి ఎంత పణం పెట్టాల్సి వస్తుంది పాపం!..ఒక్క క్షణమైనా శాంతి, హాయి అనేది ఎరక్క - ఎప్పుడు ఏ పొరబాటు పని చేస్తామో - ప్రాణాంతకమైన ఏమాట ఎప్పుడు నోరుజారి వస్తుందోనని అతి జాగ్రత్తతో మసులుకోవాలి!... నిజంగా ఇంతపణం — ఇంతజాగ్రత్త— ఇంత ఆదుర్దా తగునా హత్యకి?

[లేచి కిటికీదగ్గరకువెళ్లి అద్దాలతలుపులు వేస్తాడు—]

అసలా పొరబాటు ఎప్పుడు చేసేదీ—ఆ మాట ఎప్పుడు నోరుజారేదీ తనకే తెలీదనుకుంటాను... కొంచెం టపుచ్చుకో నరహరీ—చాలా చలిగావుందికూడానూ.

నర : థాంక్స్. తీసుకుంటాను.

[మేజాదగ్గరకు వెళ్తాడు. రాజా కిటికీ దగ్గరే బైటికిచూస్తూ మాట్లాడుతూండగా, నరహరి జేబులోంచి చిన్న గాజుగొట్టం తీసి అందులోని సరుకు రాజారావుకప్పులో గబగబా వొంచేస్తాడు—]

రాజా : అప్పుడే ఆకాశం నెమ్మదిగా తెల్లబారుతోంది ... ప్రభాతకాంతి ప్రపంచాన్ని ప్రదీప్తం చేస్తోంది...మళ్లీ ఇంకోరోజు!... హంతకుడు తన నాలికనదిమి పెట్టుకుని, మూతి బిగబట్టి, మాటజారకుండా, వొళ్లు దగ్గర పెట్టుకుని, పొరబాటు చెయ్యకుండా, బహుజాగ్రత్తగా మసలాల్సిన మరోరోజు! ...ఒక్క పొరబాటు మాట—ఒక్క పొరబాటు చేత—అంతే! దాంతో ఉరికంబం ఎక్కాల్సిందే!

[మేజావద్దకు వస్తాడు. రాజారావు ఇటు తిరిగేసరికి గాజుగొట్టం నరహరిజేబులోకి వెళ్లిపోయి వుంటుంది. అతను ఫ్లాస్కులోంచి రెండు కప్పుల్లోకి టీ పోస్తూ]

అసలతనికి రాత్రి నిశ్చింతగా నిద్రపోవడానికి ధైర్యం ఎలావచ్చిందని!

[నరహరి రెండో కప్పు తీసుకుని ఎడమపక్క సోఫాదగ్గరకొచ్చి రాజారావుకి వెన్ను చూపుతూ నిలబడతాడు. రాజా తన కప్పు తీసుకుని—]

చాలామంది మనుష్యులు నిద్రలో మాట్లాడుతూంటారు తెలుసా నరహరీనీకు?

[నరహరికి ప్రేక్షకులకీ వెన్ను చూపుతూ కాస్సేపు నిలబడతాడు రాజారావు. ఫ్లాస్కులోంచి ఇంకాస్త టీ పోసుకుంటూ కాబోలు. నరహరికి లోలోపల ఆందోళన ఎక్కువౌతుంది—]

పరాయిమనిషి ఏ ఏదాలాభంగా చూసినప్పుడో—ఏ అనుకోకుండా చెవియొగ్గి విన్నప్పుడో బైటపడిపోతుంది...రహస్యం అంతా బట్టబయలై, పేకమేడల్లా ఆశలూ ఆలోచనలూ అన్నీ ఒక్కసారి కూలిపోతాయి!

[కప్పు తీసుకుని నరహరి దగ్గరకు వస్తాడు—]

నిజంగా అది చాలా ఘోరమైన దుర్మరణం నరహరీ! మెడకి తాడుకట్టి ఐహికంలోంచి అమాంతం అవతలికి ఎత్తి పారెయ్యడమా!...ఏ ఐహికంకోసం కృపణుడై తన దారుణహస్తాలతో ఒకనితడు ప్రాణాన్ని నిలువునా తీశాడో ఆఐహికంనుంచి ఎడబాటా? పిచ్చికుక్కను ఉచ్చుతో బంధించి బండీలోకి పారేసినట్టు - ఉరితాటితో బిగించి రౌరవంలోకి విసిరివేయబడటమా!...ఎంతఘోరం!...

[మళ్ళీ మేజా దగ్గరకు వెళ్తాడు. కప్పు

# ★ కాళరాత్రి ★

ఎత్తుతాడు తాగటానికి. నరహరి కూడా ఎత్తుతాడు. రాజా కప్పందించి—]

నిజంగా ఈలంకలో ఎంత భయానక కృత్యాలైనా దుష్టులు నిర్భయంగా నిరాంటకంగా నెరవేర్చుకోవచ్చు.

[కప్పు ఎత్తి సగంతాగేస్తాడు. నరహరి ఎత్తినకప్పు ఎత్తినట్లేవుంది. కన్నార్పకుండా రాజాముఖాన్ని పరిశీలిస్తూంటాడు. రాజా కొస్త వెకిలిగా చిరునవ్వు నవ్వుతాడు—]

తమాషాగావుంది రుచి ఈసారి.

కప్పు బల్లమీద పెట్టి చేత్తో కళ్లూనుదురూ ఒత్తుకుంటాడు. బల్లపట్టుకునే నడవలేక నడవలేక ఆ చివరదాకా వెళ్తాడు. కడుపుచేత్తోపట్టుకుని కుర్చీలో కూలబడతాడు...మొహం బల్లమీద పడుతుంది—]

నాకు - నాకు—

(దగ్గరకు వస్తాడు నరహరి. రాజా అతనివంక చూస్తాడు. నరహరి వంగి అతన్ని నిశ్చలంగా పరిశీలిస్తూంటాడు—]

నువ్వు—

[నోటమాట పెగలదు రాజాకి. నరహరి పైశాచికంగా చూస్తూంటాడు. రాజా దేహం వణకిపోతుంది. కళ్లు భయంతో పెద్దవై పోతాయి—]

నువ్వు - విషం - విషం పెట్టావ్ నాకు_ ఓహ్—

(తల మేజామీదకు పడిపోతుంది. చేతులు బారజాచుకుంటాయి. వొళ్ళంతా ఒక్కసారి కంపించి నిశ్చలం అయిపోతుంది. నరహరి తన కప్పులో టీ ఒక్కసారి తాగేసి జేబులోంచి గాజు గొట్టంతీసి గుడ్డతో శుభ్రంగా తుడిచి మేజామీద పడివున్న రాజా చేతిపక్కనే వుంచుతాడు. జేబుగుడ్డ అడ్డంగా వుంచుకునే రాజా తాగిన కప్పు కూడా కొస్త దగ్గరకు జరుపుతాడు. తన కప్పుకూడా గుడ్డతో శుభ్రంగా తుడిచేసి పెడతాడు. ఫ్లాస్కు కూడా అలానే తుడుస్తాడు. త్వరత్వరగా అటూ యిటూ చూస్తూ చేస్తాడీపనులన్నీ. చివరికి విజయంతో వికసించినముఖంతో గది అంతా ఒక్కసారి కలయజూచి భోజనాలగదిలోకి గబగబా వెళ్లిపోతాడు. ఒక్కక్షణం తరవాత. నళిని వరండా తలుపులు తెరుచుకువస్తుంది. రాజానిచూసి ఒక్క వెర్రికేక పెట్టి అతని దగ్గరకు పరుగెత్తుకొస్తుంది-]

నళిని: రాజా - రాజా—

రాజా: (కళ్లు తెరిచి ఆమెను వారిస్తూ) ష్—

నళిని: అబ్బ-గుండె లవిసిపోయినయ్... (రహస్యంగా) ఏం జరిగిం దసలు ?

రాజా: నువ్వు చెప్పినంతా అయింది. నరహరి నన్ను హత్యజేయ సమకట్టాడు! ఆత్మహత్య చేసుకున్నానని అంతా అనుకోవడం కోసమే కాబోలు, ఇదుగో ఈ గాజుగొట్టం కూడా ఇక్కడే వుంచిపోయాడు. ఏదో కాలకూట విషమై వుండాలిది!

నళిని: నువ్వుగాని తాగలేదుగదా కొంపతీసి ?

రాజా: లేదులే. నేనూ చచ్చిపోయినట్లుగానే పడిపోయాను ఏం జరుగుతుందో చూద్దామని...అదుగో ఆ కిటికీ రక్షించింది నన్నివ్వాళ. దాని అద్దంలో కనిపించింది స్పష్టంగా, అతను నా టీ కప్పులోకి ఇందులోని విషం పొయ్యడం.

నళిని: (అటూ యిటూ తిరుగుతుంది ఆలోచిస్తూ) ఇప్పటికి పప్పులో కాలేశాడన్నమాట నరహరి, నీ ప్రాణాలమీద కూడా ప్రయత్నంచేసి! హంతకుడు చేసితీరాల్సిన పొరబాటు పని ఇక్కడ చేశాడన్న మాట!...ఇక నతన్ని పట్టుకోవడం ఎంతసేపు!

రాజా: ఎలా? నన్ను చంపడానికి ప్రయత్నించాడని చెప్పినా ఎవరూ నమ్మరు కదా!

నళిని: (ఒక నిర్ణయానికొచ్చి) మరేం ఫరవాలేదు. నువ్విక్కడే పడివుండు. నేనొచ్చినప్పుడెలా పడివున్నావో అలానే. నువ్వు చనిపోయావనే నమ్మకంతో వుంటాడు గనక, జాగ్రత్తగా వుండాల్సిన అవసరం దాటిపోయిందనుకుని, ఏదో మాటకూడా జారక మానడు. ఏం జరిగినా సరే—నువ్వుమటుకు కదలరాదు - మెదలరాదు. ఊఁ—పడు—

రాజా: (పడి) ఇలాగేనా ?

నళిని: ఆఁ. ఇప్పుడే వస్తాన్నేను... (బిగ్గరగా) మోహన్‌రావుగారూ—మోహన్‌రావుగారూ—

[అని కేక వేస్తూ పడమటింటిలోకి పరుగుతీస్తుంది. ఒకక్షణం అవకాశం. నరహరి భోజనాల గదిలోంచి నెమ్మదిగా వస్తాడు. రాజావంక చూస్తూండగా వరండాలో ఎవరో వస్తున్న చప్పుడవుతుంది. నరహరి గబగబా భోజనాల గదిలోకి వెళ్లిపోతాడు. వరండాలోంచి రామానుజం వస్తాడు. రాజానిచూసి నిర్ఘాంతపోతాడు. దగ్గరకొచ్చి చూడబోతాడు గాని అంతలోనే భయం వేసి ఎడంగా వెళ్తాడు. ఏం తోచక కొస్త గాబరాపడి నరహరిని కేకేస్తాడు.

అంతలోనే పడమటింటిలోంచి నళిని, మోహన్ వస్తారు. రామానుజాన్ని చూసి కటిక్కున ఆగిపోతారు—ముందనుకున్న ప్రకారం జరగడానికి రామానుజం అడ్డమొచ్చాడు కాబట్టి, అంతలోనే సర్దుకుంటుంది నళిని. రాజావంక ఓసారి చూచి ఇక నడుపుతుంది నాటకం—]

నళిని: (ఏడుపు స్వరంతో రాజాకేసి పరుగెత్తుకొస్తూ—] రాజా - రాజా—

మో: ఏమిటిది? ఏం జరిగింది? (రాజాకేసి వెళ్తాడు.)

రామా: ఏమోనండీ లోపలకొచ్చానిప్పుడే నేను. పడివున్నాడల్లా. ఏం అర్థంకాక కేకేస్తున్నా నరహరిగారికోసం.

మో: (రాజానాడి చూచి) చచ్చిపోయాడు.

రామా: } ఆఁ
నళిని: } (కెవ్వుమంటుంది)

రామా: చచ్చిపోయాడా!

మో: అవును.

(క్షణంసేపు అంతా నిశ్శబ్దం)

రామా: ఆత్మహత్య!

మో: నరహరిని పిల్చుకురండి అతనికేమన్నా తెలుసేమో...ఊఁ—

[రామానుజం భోజనాల గదిలోకి

వెళ్తాడు. మోహన్ నళిని వంక కొంటెగా చూస్తూ]

ఊరడిల్లుము దేవీ—ఊరడిల్లు.

నళిని : ఏం—బాగా ఏడవటం లేదా నేను ?

మో : ఓ—దివ్యంగా ఏడుస్తున్నావ్ ! ఆడవాళ్ళకు అదికూడా నేర్పాలా ? అపకు మధ్యలో—కానీ—

రాజా : (తలఎత్తి చూచి) రామానుజం అనుమానించడం లేదుకదా ?

మో : వాడిబొంద. ఆమాత్రం తెలివి తేటలు కూడానా ?

నళిని : (మోహన్‌తో) నే చెప్పింది మటుకు మర్చి పోకండి. అదే మనకి తారక మంత్రం !

మో : అవును. నాకు తెలుసు.

నళిని : ష్—

[గబగబా వెళ్లి మెట్ల దగ్గర నుంచుని చెరగుతో ముఖం కప్పుకుని ఏడుస్తూ వుంటుంది. నిశ్చలంగా పడివున్న రాజా వంక దీనంగా జాలితో చూస్తూ నుంచుంటాడు. మోహన్. భోజనాల గదిలోంచి నరహరి, రామానుజం వస్తారు, కమలకూడా వస్తుంది]

నర : (గబగబా రాజారావు దగ్గరకు వస్తూ) ఏం జరిగింది ?

మో : విషం తాగేడనుకుంటాను... ఇదుగో గాజుగొట్టం ! *Poison* అని వ్రాసి వుంది దీనిమీద.

నర : మై గాడ్.

[కమల భయంతో రాజావంక నిశ్చలంగా చూస్తూంటుంది].

మో : ఇదుగో కప్పు. (వాసన చూచి) తమాషాగా వుంది వాసనకూడా.

నర : కొయితం అదీ ఏమైనా వ్రాసి పెట్టి పోయాడా ?

మో : ఏమో మరి ... కాగితం కనిపించ లేదు.

రామా : చూడండి జేబుల్లోను అక్కడా.

మో : ఎందుకండీ అనవసరంగా,

నర : చూడరాదు పోనీ ముంచుకు పోయిందేముంది.

[మోహన్ రాజా జేబులు వెదుకుతాడు. ఓ జేబులో తాళంచేతులు మోగుతాయి.]

రామా : ఏమిటవ్వి ?

మో : (తప్పనిసరై బైటికి తీసి) తాళం చేతులు.

నర : లాంచీవి కాదుగదా ?

రామా : అవ్వే అయివుండాలి. చూశారా బుకాయించాడిందాక తను దాచ లేదని ! నిజమేఅయింది నే చెప్పింది. ఆత్మహత్యకంటే ఎక్కువసాక్ష్యం, ఏంకావాలి నారాయణ్ణి హత్యచేసింది ఇత నేఅనడానికి?

నర : ఇంతకుముందు మటుకు సందేహం ఏముంది.

మో : నా మటుకు నే ననుమానించాను ...పాపం—మనిషికి పిచ్చెక్కిపోయి మన సెందుకో పాడయిపోయిందనుకుంటాను.

నర : అవునవును. మర్యాదకు భంగ

# ★ కాళరాత్రి ★

కలగనివ్వని సంజాయిషీ ఇది!

[అని రాజారావు వంక చూస్తాడు. మోహన్ ముఖం కోపంతో ఎఱుపెక్కుతుంది కాని వెంటనే అణుచుకుంటాడు]

రామా: ఇలా ఇవ్వండా తాళం చేతులు. (తీసుకుంటాడు)

నర: ఇప్పటికైనా పోలీసుల్ని ఎంత త్వరగా రప్పిస్తే అంత మంచిది.

[భోజనాల గదిలోంచి సుకుమార్ వస్తాడు.]

సుకు: (రాజాని చూసి) ఏమిటిదంతా? ఏంజరిగింది రాజారావుగారికి?

రామా: టైంలేదిప్పుడు వివరాలు చెప్పడానికి. వెంటనే వెళ్లి పిలుచుకురావాలి పోలీసుల్ని మనిద్దరం. రండి...ఆఁ—చూస్తూంటారుగదూ మీరిద్దరూ ఇక్కడి వ్యవహారాలన్నీ జాగ్రత్తగా?

మో: నేనుకూడా మీతో వస్తాను. నరహరివున్నాడుగా కొస్త ధైర్యస్థుడు... ఆఁ - నరహరిగారూ! మీకీ విషాల సంగతి తెలుసన్నారు. కదూ ఓసారి?

నర: అవును. ఏదో కొద్దిగా. ఓసారి వ్యాపారరీత్యా తత్సంబంధమైన విషయాలు తెలుసుకోవాల్సి వచ్చింది...ఎందుకు?

మో: (గాజుగొట్టం ఇస్తూ) ఇదేమిటో చెప్పగలరా?

నర: (వాసనచూసి) ప్రూసిక్ ఆసిడ్.

మో: పుచ్చుకోంగానే ప్రాణాలు పోతాయా?

నర: అవో. అందులో మటుకు అనుమానం లేదు. (గొట్టం జేబులో వేసుకోబోతాడు)

మో: అది ఎక్కడుందో అక్కడేవుంచితే బాగుంటుందనుకుంటాను.

[తీసుకుని బల్లమీద పెడతాడు]

నర: అవునవును. ఎలా వున్నది అలా వదిలెయ్యడమే మంచిపని.

రామా: అదే నావుద్దేశం కూడానూ... ఐతే వెళ్లొస్తాం మేం. వుంటారు కదూ జాగ్రత్తగా, తలుపులన్నీ వేసుకునీ?

నర: ఓ! తప్పకుండానూ.

[రామానుజం, సుకుమార్ వరండాలోంచి వెళ్తారు]

- మో. (పోబోతూ ఆగి దుఃఖావేశంతో శ్వాసఎగదన్ని మాట పెగలనట్లు) వస్తాను-వస్తాను నరహరీ - నళినీ—

[అటూయిటూ చూసి బాల్కనీమీద నక్కి వున్న నళినిని చూసీ, చూడనట్లు—]

ఏదీ నళిని?....పాపం వెళ్లిపోయినట్లుంది ఈ బీభత్సదృశ్యం చూడలేక...పాపం రాజా అంటే పంచప్రాణాలూనూ ఆపిల్లకి...వస్తాను నరహరీ - నువ్వుమటుకు జాగ్రత్తగా వుండూ.

నర: మంచిది వెళ్లిరా.

[మోహన్ వెళ్తాడు వరండాలోకి. నరహరి కూడా వెళ్లి తలుపులు జేరగిలవేసి తిరిగి వస్తాడు. పైశాచికంగా విరగబడి నవ్వుతాడు, కాని భయోద్వేగంతో కమల తన్ను పరిశీలించడం చూసి నవ్వు ఆపుకుంటాడు.]

కమల: నవ్వుతున్నారా మీరు!

నర: కమలా! (మెల్లిగా ఆమెదగ్గర కొస్తూ) నీ మనస్సింకా చికాకుగానే వున్నట్టుంది.

కమల: (వెనక్కి తగ్గుతూ) నాదగ్గరకు రాకండి.

నర: దీనికి నువ్వెంత బాధపడుతున్నావో నాకు తెలుసు కమలా!

[రాజా వంకచూస్తూ జాలితో తల వూపుతూ—]

పాపం! ఎటువంటి దుర్మరణానికి పాల్పడ్డాడో చూడు!...రా కమలా - మనం వుండరాదిహ నిక్కడ.

కమల: భగవంతుడు నన్నసలు క్షమిస్తాడా?...ఆ వుత్తరాన్ని గురించి నిజం కప్పివుచ్చినందుకు నన్ను శిక్షించడూ దేవుడు?

నర: నువ్వు కాస్సేపు నిద్రపోవాలి కమలా—నీమనసు మనసులో లేదు.

కమల: (రాజా వంకచూస్తూ) నేనే కనక నిజం చెప్పేసివుంటే, రాజారావుగారీ దుర్మరణానికి పాలయ్యేవారే కాదు. వారిని రక్షించ గలిగివుండి కూడా అబద్ధం ఆడేను. ఆవుత్తరం—

నర: వుత్తరం లేదు - గిత్తరం లేదు. పోయిపడుకో - పో.

కమల: (అసహ్యించుకుని బీదరింపుతో) నే చెప్పేది ఎందుకు వినిపించుకోవ్? నేను అబద్ధం ఆడేనని చెప్తున్నాను. నిజం దాచిపెట్టానంటున్నాను. సరళ ఆ వుత్తరం వ్రాసింది రాజారావుగారికి కాదు—

నర: అనవసరంగా మాట్లాడవద్దని చెప్తున్నాను. ఎవళ్ళకి రాస్తేమటుకిప్పుడేం ప్రయోజనం?

కమల: ఆ వుత్తరం రాసింది నారాయణకి! - రాజారావుగారికి కాదు. ఓహ్—

[ఏడవటం మొదలెడుతుంది]

నర: నువ్వేం మాట్లాడుతున్నావో నీకే తెలీదు. సరళ ఆ వుత్తరం వ్రాసింది రాజారావుకి!

కమల: కాదు - నేనిప్పుడు నిజం చెప్తున్నాను. సరళ ఆ వుత్తరం వ్రాసింది నారాయణకి! తన భర్తకు. అది నారాయణ చూడటం నాకిష్టంలేకపోయింది. అతన్నంతగా ఆమె ప్రేమించడం సహించలేకపోయాను; పాపిష్టిదాన్ని నేనే చదివి చింపి ఆముక్కలు చిత్తు కాగితాలబుట్టలో పారేశాను. ఆకవరుకూడా అక్కడే పారేస్తే ఏబాధా లేకపోయేది. పొరబాటున అది మిగతా వుత్తరాలతోబాటు లోపలికి తీసికెళ్ళి అక్కడ చించి పారేశాను. మేడిపండులాంటి నాపరువు మర్యాదలకోసం భయపడిపోయి ఆ సంగతి ఎవరికీ చెప్పలేకపోయాను. రాజాకైనా చెప్పివుంటే బాగుండేది. చెప్పక దాచిపెట్టి అతని ప్రాణాలే అపహరించిన పాతకినయ్యాను. ఓహ్ - ఏమిటినాకు శిక్ష? ఇప్పటికైనా ఒప్పుకుంటే పాప పరిహారం అవుతుందేమో - చెప్తాను. అందరితోనూ అసలు సంగతి చెప్పేస్తాను.

[వరండా వైపు వెళ్ళబోతుంది]

నర: (అడ్డంవచ్చి) ఆగు! (కంఠస్వరం తగ్గించి) ఏమిటి కమలా, మరీ ఇంత మూర్ఖురాలివైపోతున్నావ్? అవన్నీ చెప్పడంమూలాన ఏం లాభం ఇప్పుడు? అనవసరంగా నువ్వు రొంపిలో దిగడం నాకేం ఇష్టం లేదు.

కమల: రేపు సరళైనా చెప్తుంది ఆ వుత్తరం తనభర్తకు వ్రాసున్నానని.

నర: చెప్తే ఏం? ఎవళ్ళు నమ్మతారు దానిమాటలు? రాజారావు చచ్చిపోయాడు- చేతులారా చేసిన పాపానికి ఫలం అనుభవించలేక ఆత్మహత్య చేసుకుని చచ్చిపోయాడు.

కమల: కాదు - అతనా ఘోరం చేసివుండడు. అతనంత దురంతం చెయ్యాల్సిన అవసరం లేదు. నారాయణంటే అతనికేం అసహ్యంగానీ ద్వేషంగానీ లేదు. పోనీ ఆ వుత్తరంగురించి మీరైనా అడగలేదేం నన్ను (అకస్మాత్తుగా నిజం తట్టి) ఓహ్ - అదా అసలు సంగతి! మీకు తెలుసన్నమాట! ఇంతసేపూ ఆ వుత్తరం నారాయణదేనని మీకు తెలుసన్నమాట! తెలిసికూడా వాళ్ళకి చెప్పలేదు!

నర: అనవసర విషయాల్లో నే జోక్యం కలిగించుకోను.

కమల: (అతనివైపే తదేకంగా చూస్తూ) నేనా కవరు ఎందుకు చించి చూశానో అడగరేం? తెలుసుకోవాలని లేదూ?

నర: అనవసరంగా వాక్కు - వెళ్లిపోయిక్కడ్నుంచి.

కమల: (మొండిగా) మీకెందుకని లేదో తెలుసుకోవాలని?

నర : (అటు తిరుగుతూ) తెలుసుకోవాల్సింది ఏమీ లేదు. నారాయణా, రాజారావూ ఇద్దరూకూడా చచ్చిపోయారు. కేసు పూర్తిఅయిపోయింది!

కమల : (అతన్ని వెంటాడుతూ) నువ్వే! రాత్రి ఈ గదిలో దాక్కొని వున్నదినువ్వే! మేం వచ్చినతర్వాత పారిపోయావ్! మా సంగతంతా ఎరుగుదువ్! - ఎరిగి కూడా వూరుకున్నావ్!

నర : (వచ్చినకోపం అణచుకుని ఆమెవంక చూసి మళ్లీ చూపులు తిప్పుకుని) నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలీదు... పోయి పడుకుంటావా లేదా - ఈగది మూసెయ్యాలి.

కమల : (వెనకే వెళ్తూ) ఇంకా నేనతన్నే ప్రేమిస్తున్నాను.

[అతనిటు తిరుగుతాడు]

అర్థం అయిందా? వినిపిస్తోందా?

[అతనో అడుగు ముందుకు వస్తాడు]

నేనతన్నే ప్రేమిస్తున్నాను. ఎప్పుడూ-

[వికటంగా నవ్వుతుంది. నరహరి ముఖం కోపంపట్టలేక వికృతం అవుతుంది]

ఇహ నువ్వేం చెయ్యగలవ్? బావనైతే చంపగలిగావ్ - నా ప్రేమని చంపగలవా? నాదగ్గరకు రాకు - వద్దు - నువ్వంటేనే అసహ్యం నాకు - ఛీ—

[వున్నట్టుండి నరహరి ఆమెను పట్టుకుంటాడు క్రూరంగా. విడిపించుకోవాలని విదిలించుకుంటూంది కమల]

నర : కానీ - ప్రేమించు-ఇంకాబాగా ప్రేమించు... నేనంటేనే అసహ్యంకదూ? వాడూనువ్వూ కలిసి నన్ను వెట్టి వెధవకింద కట్టిపారేశారు కదూ?...చచ్చాడు దరిద్రుడు - పీడా వదిలింది.

కమల: నువ్వే చంపావ్ అతన్ని!... అవును నువ్వే! వాళ్ళకి చెప్తాను. హంతకుడవు నువ్వేనని అందరికీ చెప్పేస్తాను.

[నరహరి గబుక్కున వదిలిపెడతాడు కమలని. తన్నుతాను నిగ్రహించుకోడానికి ప్రయత్నిస్తాడు]

నర : నీమాటలు నమ్ముతారనే అనుకుంటున్నావా?

కమల : నమ్మితీరాలి. నమ్మేటట్లు చేస్తాను.

నర : (తేరుకుని, కమలను పట్టుకుని నెమ్మదిగా) ఇదుగో - నామాటవిను కాస్త తమాయించుకుని... రామానుజమూ వాళ్ళూ పోలీసుల్ని తీసుకురావడానికి వెళ్ళారు. వాళ్ళు రాంగానే ఈ ఇద్దర్నీ తీసుకువెళ్తారు. అంతే - కేసు ఆఖరైపోతుందంతటితో!

కమల : రాజా ఆత్మహత్య చేసుకోనలేదు. నారాయణ్ణిచంపి, నువ్వే ఆయన్ని కూడ హతమార్చావ్!...కదూ?

నర : ఓరి భగవంతుడా!—నీనోరు మూతపడదా యేమిటిహ? (పట్టుదలతో పట్టిపట్టి మాట్లాడుతూ) ఈక్షణం నుంచీ నువ్వు కనక నే చెప్పినట్లు అక్షరాలా నడుచుకోక పోతే నా—

[భోజనాల గదిలోకి ఈడ్చుకు పోతాడామెని. రాజారావు లేచి కిటికీదగ్గరకు వెళ్ళి నిట్టూరుస్తూ నిలబడతాడు బాల్కనీమీద నళిని నిలబడి ఏదో చెప్పబోయి భోజనాల గదిలోంచి ఎవరో వస్తూంటం విని మళ్ళీ దాక్కుంటుంది. నరహరి వస్తాడు. రాజా వెనక్కి తిరుగుతాడు. ఒక్క క్షణం ఇద్దరూ ఒకరినొకరు చూచుకుంటారు. తర్వాత రాజానరహరివైపు నడుస్తాడు. నర

(54-వ పేజీ చూడండి)



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 144. భూమితిరుగుతూనే వుంటే వేటకు వెళ్లినపక్షి గూడుని గుర్తు పట్టగలదా?

"నా కాకి గాలిలో అరగంట ఎగిరిందనుకొండి. భూమి తిరగడమువల్ల స్థలం మారిన గూటిని ఎలాగు గుర్తుపట్టుతోంది?" అని రంగాపురంనించి జాహెద్ హుసేన్ గారు అడుగుతున్నారు.

అసలా కాకి ఎక్కడిదీ? తిరుగుతున్న భూమిమీద వొక చెట్టు, ఆచెట్టుమీద గూడు, గూటిలో కాకిని. కాకి గూడులో వున్నప్పుడు భూమితోపాటు అదీ తిరుగుతోంది కదా. ఇలాగ భూమితోపాటు తిరుగుతూన్న గూటినుంచి ఎగిరిన కాకికి, గూటిలో వున్నప్పుడు భూమితోపాటు తిరుగుతూండినప్పటి వేగము మాత్రమే కాక ఎగిరేవేగము కొత్తగా వచ్చిందీ, కాకి పైకి యెగిరింది. ఇప్పుడు భూమీ తిరుగుతోందీ, అంతేవేగముతో కాకీ తిరుగుతోంది! కాదామరి? కాకి, తిరిగే భూమిమీదినుంచే ఎగిరిందాయెను! కనక భూమి తిరిగేవేగము కాకికీ వుంది. ఎగిరే వేగము కాకికి మాత్రమే వుంది. ఆవేగము మానేస్తే కాకి భూమిమీదికి దిగిపోతుంది. ఎక్కడికి దిగుతుందీ, గూటిమీదికే! భూమి నేలబారుగా తిరుగుతోందీ, ఆవేగముతోనే, ఎగిరే కాకికూడా నేలబారుగా తిరుగుతోంది. కాకిని గాలిలో 'వదిలేశి' భూమి తిరిగిపోతోందనుకుంటున్నారుమీరు. అది సరికాదు. తిరిగే భూమిమీదినుంచేకాదూ ఎగ్గిరింది కాకీ? ఆభూమి వేగము కాకికీ వుంది. భూమి ఎంతవేగముతో తిరుగుతోందో, ఎగురుతూన్న కాకికూడా అంత వేగముతోనే తిరుగుతోంది. కాకి రెక్కలుకొట్టకుండా ఉంటే గూటికి పైనే వుంటుంది. రెక్కలుకొట్టి కొంత దూరము అదనముగా ఎగిరితే అంతేదూరము మళ్లీ వెనక్కి ఎగిరి గూటికి చేరుకుంటుంది.

మనము ఇల్లువదలి ఇంకొకచోటికి నడిచి వెళ్ళి తిరిగి ఇంటికి రావడానికీ, కాకి ఎగిరి మళ్లీ గూటికి చేరుకోడానికీ భేదములేదు. తిరిగే భూమిమీద నడిచే మనకు కూడా భూమివేగము ఉన్నట్టుగానే, ఆభూమిమీదనుంచే ఎగిరిన కాకికీ వుంది. కాకి పైకి ఎగిరినప్పుడు భూమీ, గూడూ, కాకీ, అన్నీ తిరుగుతూనే వున్నాయి. భూమివేగమే కాకిదీని; కనక గాలిలోవున్నా కాకికూడా భూమితోనే తిరుగుతోంది. భూమి కాకిని 'వదిలేశి' తిరిగి పోతుందనుకుంటున్నారు మీరు. లేదు. భూమితిరిగినట్టే కాకీ తిరుగుతోంది. అయితే ఎరకోసము వెళ్లడమే కాకి అదనముగా చేసేపని. ఆపని నిమిత్తమే కాకి రెక్కలాడించి, మళ్లీ తిరిగివస్తోంది. ఎగురుతూన్నంతసేపూ భూమి ఎంతతిరుగుతోందో కాకీ అంతా తిరుగుతోంది. గూడు కాకిని విడిచి ముందుకు పోవడము లేదు. గూడుతో పాటు కాకీ ముందుకు వెళ్తోంది. ఇక తప్పిపోవడము ఎలాగ జరుగుతుందీ? కాకి తనకు తెలియని దారులలో తిరిగితే నే!

రైలులో కూర్చుని వున్నప్పుడు ఒక నాణెము మోగించి గోటితో పైకి చిమ్మండి. నాణెము మీ చేతిలో వున్నప్పుడు దానికి రైలువేగము కూడా ఉందికదా? మీరు పైకి చిమ్మినప్పుడు నాణెము మళ్లీ కిందకి దిగడానికి నాలుగుసెకండ్లు పట్టుననుకోండి. ఈ నాలుగు సెకనులలోనూ రైలు నలభయి అడుగులు దాటుకుపోయింది. రైలులో వున్న మీ చేతినుంచి వెలువడడముచేత నాణెమునకుకూడా రైలువేగమే వుందీ, అదీ నలభై అడుగులు దాటుకుపోయింది. ఇక పైకివెళ్లి కిందకి దిగడమే నాణెము అదనముగా చేస్తోంది. అది ఎక్కడినుంచి ఎగరవేస్తే అక్కడే పడుతుంది. రైలు నాణెమును విడిచి పరిగెత్తివుంటే నాణెముకూడా మీ చేతికితప్పి వెనకపడివుండును. రైలునాణెమును, (భూమికాకినివలెనే) తన వేగముతో ఈడ్చుకుపోతూనే వుంది. కనక నాణెము వెనకకిపడదూ, నిటార్గా ఎగిరిన కాకి గూడుని తప్పిపోదు. ఎరకోసము వెళ్లడము కాకి చేసేపని; తిరిగి అంతమేరా ఎగరడమూ కాకియే చేసుకోవాలి. అంతమాత్రమే. భూమి తిరగడమువల్ల ఆ భూమితోనే తిరుగుతూన్న కాకికి కొత్తచిక్కులు రావు.

## 145. రామన్ ఎఫెక్టు అనగా నేమి?

అని గొల్లప్రోలునుంచి జి. సత్యనారాయణగారు అడుగుతున్నారు.

విజ్ఞానవీధులు నెం. 1 ప్రశ్నలో 'డాక్టర్' గారు ఆకాశము నీలముగా ఉంటుందేమి?' అన్న ప్రశ్నకు జవాబిచ్చారు. దానిని సూక్ష్మముగా చెప్పినదేగాని ఈ ప్రశ్నకు జవాబు తేలదు. వినండి. సూర్యుని వెలుతురులో ఏడురంగులున్నాయి. ఈ వెల్తురు దుమ్ము, ధూళి, ఆవిరి, బొగ్గు కణములపైన పడినప్పుడు ఆ కణములు అన్ని రంగుల కిరణాలనూ విరజిమ్ముతాయిగాని ఎరుపూ, నారింజ, పసుపు, ఆకుపచ్చన, నీల, నీలి, నీలలోహిత వర్ణకిరణాలు క్రమంగా ఎక్కువగా విరజిమ్మబడతాయి. కణము చిన్నదైన కొద్దీ నీలవర్ణకిరణాలనే ఎక్కువగా విరజిమ్ముతుంది. సూర్యుని వెల్తురులోని నీలపు కిరణాలే గాలి కణాలవల్లా, గాలిలోని ధూళికణాలవల్లా ఎక్కువగా విరజిమ్మబడడమునుంచే 'ఆకాశము' నీలముగా కనబడుతోంది.

ధూళి, బొగ్గువంటి విజాతీయ కణములే కాక, గాలీ, నీరూవంటి కణములుకూడా నీలివర్ణమునే పక్షపాతంతో విరజిమ్ముటవల్ల సముద్రముకూడా నీలముగా కనబడుతోంది. అయితే రామన్ మహాశయులు కనుకున్నదేమిటంటే, నీరూ, గాలీవంటి పదార్థాల అణువులు తమపై ప్రసరించిన వెలుతురుతో వేరసారాలుకూడా సాగిస్తాయని. వెలుతురుకి ఎరుపునించి నీలలోహితంవరకూ శక్తి క్రమంగా హెచ్చుతుంది. నీలపుకిరణాలు నీటిమీదపడితే, ఆనీలవర్ణమే చాలామట్టుకు విరజిమ్మబడుతుంది నిజమే.

దీనికి తోడు "ఆనీలకిరణముల శక్తిని కొంత మట్టుకు నీటి అణువులు గ్రహించి, మిగిలిన తక్కువశక్తితో ఆకిరణాల్ని విరజిమ్మడము కూడా కద్దు, అని రామన్ గారు కనుక్కున్నారు. వెలుతురు విరజిమ్మబడడములో శక్తిని నష్టపోయి ఎరుపువైపు జరగడము కొత్త. అయితే కొన్ని పరిస్థితులలో, అంటే ఉష్ణోగ్రత ఎక్కువగా ఉన్నప్పుడు, నీటిఅణువే తన శక్తిని కొంత వెలుతురు కిచ్చి దానిరంగును నీలలోహితము వైపు జరపడముకూడా కద్దు. అంటే నీరూ, గాజూ, గాలీ, వజ్రమూవంటి కాంతి ప్రవేశకపదార్థాలు వెలుతురుని విరజిమ్మినప్పుడు తము గ్రహించగలిగిన శక్తిని ఆ వెలుతురునుంచి గ్రహించి వెలుతురును అంతమట్టుకు శక్తిహీనముగాచేసి పంపివేయనూ వచ్చును, తాము దానము చేయగలిగిన శక్తిని వెల్తురుకిచ్చి మొదటికన్న శక్తివంతముగా చేసి పంపనూ వచ్చును. అయితే నీలపు కిరణాలు ఒకపదార్థములో నుంచి ప్రసరించినప్పుడు, ఆ పదార్థపు అణువులు ఎక్కువగా నీలి కిరణాల్ని, అంతకంటె తక్కువగా శక్తి తగ్గి (ఎరుపు వైపు మొగ్గి)న ఆకుపచ్చని కిరణాల్ని, ఇంకా తక్కువగా శక్తిహెచ్చి నీలలోహితములైన కిరణాల్ని విరజిమ్మవచ్చు నన్నమాట.

తమ మీదపడిన వెల్తురును విరజిమ్ముతూ వివిధపదార్థాల అణువులు వివిధపరిమాణముల శక్తిని గ్రహిస్తాయి. విరజిమ్మబడిన వెల్తురును స్పెక్ట్రాస్కోపుతో విశేషిస్తే, అసలు కిరణాలరంగుకితోడు అణువులకు శక్తినిచ్చి రంగుమారిన కిరణాలూ, అణువులనించి శక్తినిపొంది రంగుమారిన కిరణాలు గోచరిస్తాయి. ఈకిరణాల స్థానభ్రష్టతనుకొలిచి, ఆపదార్థముయొక్క శక్తి ప్రదానస్తోమతను లెక్కగట్టవచ్చును. ఈస్తోమత ఎప్పుడూ ఒక్కటేకాదు. ఒక్కొక్క పదార్థం కాదు ఒకొక్క రకపు అణువునకుగల శక్తి ప్రదానస్తోమతలు కొన్ని-నిర్ణీతమైనవి—ఉండును. గంధకద్రావకము రెండురకాలుగా వెల్తురులో వియ్యమందగలదు, శంఖద్రావకము ఇన్నిరకాలుగా, కర్బనద్విగంధకిదము ఇన్నిరకాలుగా, అని తబిశీళ్లు తెలుసుకోవచ్చును. ఈ రకాలూ, ఆసంబంధాలలో ఒకరకపు అణువులు కోల్పోవగల శక్తుల ప్రత్యేక విలువలూ, కట్టిపెట్లయితే, ఈ తబిశీళ్లన్నీ ఆ అణువుల గుణాలుగా పట్టిక వేసుకోవచ్చు. రామన్ గారి అవలోకనము కాంతిప్రవేశక పదార్థాల అణువుల ప్రత్యేకగుణాలను తెలుసుకోడానికి ఒక కొత్తపద్ధతిని సమకూర్చి పెట్టినది. ★

# చిట్టి ప్రశ్నలకు జవాబులు

—ఉరుముకంటె ఫిరంగి పేలినప్పుడే చాలాదూరము వినబడుతుంది. ఉరుము సుమారు 15 మైళ్లకంటె ఎక్కువ దూరము వినబడదు. మెరుపూ ఉరుమూ ఒకేసారి పుట్టినా, వెలుతురు సెకనుకి 186000 మైళ్లున్నూ, శబ్దము సెకనుకి 1100 అడుగులున్నూ వ్యాపిస్తుంది కనక మెరిసిన కొంతసేపటికిగాని ఉరుము వినబడదు. ఈ అంతరమునుబట్టి ఉరుము ఎంతదూరమున పుట్టినదీ లెక్కవేయవచ్చును. మైళ్లదూరపు ఉరుము, పుట్టిన 72 సెకనుల తర్వాతకూడా వినబడదు. ఇంతవ్యవధిని ఎవరూ గుర్తించియుండరు. 1914-18 యుద్ధములో మిగిలిన మందుగుండును ఫిరంగులలో పేల్చి, ఆశబ్దము 60 మైళ్లదాకా వినబడిందని కనుక్కున్నారు.

—భూమి వాయుగోళమై యుండి, క్రమముగా ద్రవీభవించి, ఘనీభవించి 100 డిగ్రీలకు తక్కువగా చల్లారిన తరువాతనే నీటియావిరి ద్రవమై వర్షించి, సముద్రము లేర్పడినవి. సముద్రములోని ఉప్పులు, నదీజలములలోని ఉప్పులే. యుగాల తరబడిని సముద్రములో ఈ ఉప్పులు చేరి, సూర్యరశ్మికి సముద్రపు నీరు మాత్రమే యిగిరి, పోవుటవల్ల సముద్రపు నీటిలో చిక్కబడి సముద్రాన్ని ఉప్పన చేసినవి.



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త:- విశ్వాత్మక నరసింహమూర్తి






















చిలుక చెప్పిన ఉపాయమునకు -చిత్రవర్ణుడు సమ్మతించెను









పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త: విశ్వాత్ముల నరసింహమూర్తి







































# కలవారికోడలు



సేకరణ: శ్రీ దాసరి వెంకటకృష్ణయ్య

కలవారికోడలు కలికి కామాక్షి
కడుగుచున్నది పప్పు కడవలో పోసి.
అప్పుడే ఏతెంచె ఆమె పెద్దన్న
కాళ్ళకూ నీళ్ళిచ్చి కన్నీరు నింపె.

"ఎందుకో కన్నీరు ఏమి కష్టమ్మ?
తుడుచుకో చెల్లెలా, ముడుచుకో కురులు,
ఎత్తుకో బిడ్డను, ఎక్కు అందలము
మీ అత్త మామలకు చెప్పిరావమ్మ"

"కుర్చీపీటమీద కూర్చున్న అత్త,
మా అన్న లొచ్చారు మమ్మంపుతార?"
"నే నెరుగ నేనెరుగ, నీమామ నడుగు!"

"పట్టె మంచముమీద పడుకున్న మామ,
మా అన్నలొచ్చారు మమ్మంపు తార?"
"నే నెరుగ నేనెరుగ, మీ బావనడుగు!"

"భారతము చదివేటి బావ, పెదబావ,
మా అన్న లొచ్చారు మమ్మంపుతార?"
"నే నెరుగ నేనెరుగ, మీ అక్కనడుగు!"

"వంట చేసేతల్లి ఓ అక్కగారు,
మా అన్న లొచ్చారు మ్మమంపుతార?"
"నే నెరుగ నేనెరుగ నీభర్త నడుగు."

"రచ్చలో వెలిగేటి రాజేంద్ర భోగి!
మా అన్న లొచ్చారు మమ్మంపుతార?"
"పెట్టుకో సొమ్ములూ, కట్టుకో చీర,
పోయిరా సుఖముగా పుట్టినింటికిని"



**బొమ్మరిల్లు సీరియల్**

### అద్దెబోటులో—

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

జార్జి కథ చెప్పటం ముగించగానే, యిద్దరమూ కలిసి హారిస్‌ని నిద్రలేపటం ఆరంభించాం. వాడు మామూలుగా పిలిస్తే పలికే మనిషి కాదు: దగ్గరలో పడవతెడ్డు పడివుంటే దాంతో వాడి తలమీద మూడుదెబ్బలు వేశాను. మూడో దెబ్బకి మనిషి కొంచెం కదిలాడు. కదలటమైతే కదిలాడు కాని, ఏమిటేమిటో కలవరిస్తూ యిటునుంచి అటుకి దొర్లాడు. ఇద్దరమూ కలిసి మరికొంత గట్టిప్రయత్నంతో హారిస్‌కి వొళ్లు తెలిసేలా చేశాం. దాంతో అమాంతం లేచి కూర్చున్నాడు. అంతవరకూ వాడి గుండెలమీద పడి నిద్రపోతున్న 'మాంటే మొరన్సీ,' వీడు అర్ధాంతరంగా లేచి కూర్చోవటంతో, అంత దూరాన ఎగిరి పడింది.

ముగ్గురమూ కలిసి పడవమీద కప్పివున్న కాన్వాస్ పట్టాను వూడదీశాం. మాంటే మొరన్సీతో సహా నలుగురమూ నీళ్లల్లోకి తొంగిచూసి, వజవజ వణికిపోయాం. అంత వణికిపోవటానికి గల కారణం మరేమీ లేదు—గడిచిన రాత్రి పడుకోబోయే ముందు, నిద్ర లేచీ లేవగానే ముగ్గురమూ నీళ్లల్లోకి దూకేసి శుభ్రంగా స్నానాలు చేసెయ్యాలని నిశ్చయించుకు పడుకొన్నాం. తీరా ప్రొద్దున నిద్రలేచాకమాత్రం, ఎవరికీ వుత్సాహం లేకుండాపోయింది. నీళ్లు చూడటానికే చల్లగా యుగంలా వున్నాయి. పైగా యీదురు గాలి!

"ఎవరు దూకుతారురా ముందు?" అని హారిస్ హెచ్చరిక చేశాడు.

ముందుకాదు కదా, వెనకకూడా దూకటానికి ఎవరికీ వుత్సాహం లేదు. ఈపూటకి స్నానం మానేస్తున్నానని జార్జి అనేశాడు. 'మాంటే మొరన్సీ'కూడా మోర పైకి ఎత్తి బిగ్గరగా మొరిగేసి, పడవలోకి ఒక మూలగాపోయి ముడుచుకు పడుకొంది. స్నానం చెయ్యటంవరకు తనకు సమ్మతమే అయినప్పటికీ, స్నానంచేసి మళ్లా పడవలోకి రావటం ప్రయాసతో కూడుకొన్న పని కాబట్టి, తానా ప్రయత్నమే మానుకొంటున్నానని హారిస్ అన్నాడు.

నిజానికి నాకూ అంత చలిలో యీత కొట్టటం యిష్టంలేకపోయినప్పటికీ, వాళ్లిద్దరిలాగా అంత తేలిగ్గా బయటపడిపోకూడదనుకొన్నాను. నీటి అంచుదాకా వెళ్ళి అక్కడ దోసెళ్లతో నీళ్లు తీసి వంటిమీద పోసుకొన్నట్టు నటిద్దామని ఎత్తువేశాను. తువ్వాల ఒకటి భుజంమీద వేసుకొని ఒడ్డుపైకి వెళ్లాను. అక్కడ చెట్టుకొమ్మ ఒకటి బాగా నీటిఅంచు తగిలేలా వేళ్లాడుతోంది. కొమ్మమీద కూర్చొనే వొళ్లు తడుపుకొందామని చెట్టుఎక్కి, ఆ కొమ్మ

మూలం :
జెరోమ్ కె. జెరోమ్



అనువాదం :
విశ్వాత్ముల నరసింహమూర్తి

#  ముచ్చటగా ముగ్గురు 

మీదుగా కిందికి దిగుతున్నాను. అంతలో ఏం జరిగిందో ఏమో కాని, కాలుజారింది. పొడి తువ్వాలతో సహా గుభాలున నీటిలో పడిపోయాను. అంతా కన్ను మూసి తెరిచేలోగా నది అడుగుదాక వెళ్ళి పీపాడు నీళ్ళు మింగేశాను.

ఎలాగో నేను తంటాలుపడి నీటిమీదికి తేలే సమయానికి "అరె! మన జెరోమ్ దూకేశాడే? వీడి కింత ధైర్యం వుంటుందనుకోలేదు సుమా!" అంటున్నాడు హారిస్సు, జార్జితో.

"ఏంరా? చన్నీళ్ళల్లో స్నానం ఎల్లావుంది?" నన్ను అడిగాడు జార్జి.

"చాలా బాగుంది. చవటల్లాగా చలేస్తోందని మూలపోయి కూర్చున్నారు. నాలాగా మనస్సు కాస్త గట్టి చేసుకొని నీళ్ళలోకి దూకారా అంటే—మీకే తెలుస్తుంది—యిల్లాంటప్పుడు నదిలో స్నానం చెయ్యటం ఎంతసుఖమో!" మహా గొప్పగా అనేశాననుకొన్నాను కాని, ఆమాటలేమీ వాళ్ల మీద పని చెయ్యలేదు.

బట్టలు వేసుకొనేటప్పుడు ఒక గమ్మత్తు జరిగింది. స్నానం పూర్తిచేసి బోటులోకి వచ్చేలోగా నాకు చచ్చేచలి వేసింది. వాళ్లు తెలియని ఆ వణుకుతో తొడుక్కొంటూ తొడుక్కొంటూవున్న చొక్కాని నీటిలోకి వదిలేశాను. అసలు అల్లాంటిపని జరిగినందుకే నాకు ఒకచెంపని వాళ్లు మండుకొస్తూ వుంటే, జార్జిగాడు వెధవమొఖం ఒకటి వేసుకొని 'హీ హీ' అని పగలబడి నవ్వటం మొదలుపెట్టాడు. అసలే నన్ను చూసి ఒకరు నవ్వటం నాకు సుతరామూ గిట్టదు. ఆమాట జార్జిగాడితో చెప్పాను కూడా. అయినా వాడు నవ్వు ఆపలేదు. ఇంకా యింకా పగలబడి నవ్వుతున్నాడు. అంత పగలబాటు నేనెక్కడా చూడలేదు. దాంతో నాకు పట్టశక్యంగాని కోపం వచ్చేసింది. 'వెధవా' 'కుంకా' వగైరాపదాలు వుపయోగించి వాణ్ణి యిష్టమొచ్చినట్లు తిట్టి పారేశాను. తిట్టితేనైనా ఆదౌర్భాగ్యుడు నవ్వు అపుతాడేమో అనుకొన్నాను కాని, వాడు ఆగకుండా యింకా బిగ్గరగా నవ్వుతునే వున్నాడు.

నీళ్లలోపడ్డ చొక్కాని నెమ్మదిగా పైకి లాగుతుండగా, అది జార్జిగాడిచొక్కా గాని నాదికాదని తేలిపోయింది. ఇందాక చలితొందరలో సరిగా చూసుకోకుండా వాడిచొక్కా పైకి తీశానన్నమాట. అదే యిప్పుడు నీళ్లల్లోపడి కొట్టుకుపోవటానికి సిద్ధంగా వుంది.

జార్జిగాడిని ఏడిపించటానికి మంచి అవకాశం దొరికిందని, ఆచొక్కాని అక్కడే వదిలేసి కడుపు పట్టుకొని నేనూ విరగబడి నవ్వటం ఆరంభించాను. వాడివంకా, నీళ్లల్లో కొట్టుకుపోతున్న వాడి చొక్కావంకా చూసినకొద్దీ నాకు నవ్వువచ్చేస్తోంది. ఇంకా యింకా బిగ్గరగా నవ్వేశాను.

నా పరిస్థితిలో వచ్చిన మార్పుని వాడు అప్పటికి గ్రహించినట్లున్నాడు. పొంగి పొంగి వస్తున్న నవ్వుని ఎల్లాగో పట్టి బలవంతాన ఆపుకొని "అదేమిటిరా? నీచొక్కాని అలా వదిలేశావేం? చలికి చచ్చిపోవూ?" అని అడిగాడు.

అంతకంటే ఎక్కువ కష్టపడి నాకు వస్తున్న నవ్వు తెరలని నేనూ ఆపుకొని "అది నాచొక్కా కాదురా! నీదే!!" అన్నాను.

నవ్వుతూ నవ్వుతూ వున్న వాడిమొఖం అంత అల్ప వ్యవధిలో ఏడుపులోకి మారిపోవటమనేది నేను తొలిసారిగా అప్పుడే చూశాను.

"ఆఁ! ఏమిటన్నావ్? గాడిదా! బట్టలు తీసేటప్పుడు ఒళ్లు దగ్గిరపెట్టుకొని ఏడవలేకపోయావా? లేకపోతే గట్టుమీదనే తొడుక్కొని యివతలకి తగలబడలేకపోయావా? నీలాంటి చచ్చుకాళ్ల పెద్దమ్మల్ని అసలు పడవలోకే ఎక్కనివ్వకూడదు. ఛీ...ఛీ... ఆ గడక్కర యిలా యివ్వు!" అంటూ నామీద ఒకటే విసుక్కోవటం మొదలు పెట్టాడు.

గడక్కర మాట అటుంచి, ఆచొక్కా నదిలో కొట్టుకుపోవటమనేది ఎంత చమత్కారమైన విషయమో వాడికి అర్థమయ్యేలా చెప్పబోయాను. వాడు అదేమీ వినిపించుకోకుండా, వుడుక్కోవటం మొదలుపెట్టాడు. ఈ జార్జిగాడి బ్రతుకే అంత—మనిషిలో సరదా అన్నది మాటవరసకైనా లేదు.

పొద్దుటి ఫలహారాలకి ఆమ్లెట్లు తయారు చేసుకొందామని హారిస్సు అన్నాడు. ఆమ్లెట్లు వెయ్యటంలో తనకేదో ప్రత్యేకమైన ప్రజ్ఞ వున్నదనీ, లోగడ తాను యిలా పడవషికారుకి వెళ్లిన అనేక సందర్భాలలో వాటిని పొయ్యటం తనకు మామూలేనని చెప్పాడు. అంతే కాకుండా తాను ఆమ్లెట్లుపోస్తే, తినటంకోసం జనం నోళ్లు తెరుచుకు కూర్చుంటారనీ, ఒకసారి వీడు చేసిన ఆమ్లెట్లు రుచి చూసినతరువాత, చాలమంది మరి ఏవంటకమూ నోటికెక్కక కృశించి కృశించి చివరికి చచ్చిపోవటం కూడా జరిగిందనీ చెప్పుకొన్నాడు. ఇలాటివన్నీ చెప్పి ఆరోజు తనే ఆమ్లెట్లు పోస్తానన్నాడు.

వాడు చెప్పిన ఆ కబుర్లు వింటుంటే మాకూ నోరు తెగవూరింది. స్టౌ, పెనము వగైరా వంట సామాను అంతా వాడికి వెంటనే అందించాం. మా ప్రయాణంహడావుడిలో పగిలిపోకుండా మిగిలిన కోడిగుడ్లన్నీ వాడిచేతికి యిచ్చి, యిక వేగం వంట మొదలుపెట్టమని వాణ్ణి బ్రతిమాలాం.

గుడ్లు బద్దలు కొట్టటంలోనే హారిస్సుగాడి అవస్థ ఆరంభమైంది. అవస్థఅంటే మరేమీ లేదు; పగలగొట్టిన గుడ్లులోంచి సొన సరిగ్గా పెనంమీదనే పడేట్లు వెయ్యటం వాడికి ఎంతకీ చేతకాలేదు. సొన అంతా తనలాగూమీదా, చొక్కామీదా పోసుకొన్నాడు. చివరికి ఎల్లాగైతే నేం ఒక్క అరడజను గుడ్ల సొనమాత్రం సరిగా పెనంమీద పోయగలిగాడు. స్టౌదగ్గరే కూర్చొని అరగంటసేపు గరిటెతో దాన్నంతా కలియబెట్టాడు.

హారిస్సు కలియబెట్టిన పద్ధతినిబట్టి చూస్తే, నిజంగా అంత ప్రమాదకరమైన పని అదేకాని యింకొకటి లేదనిపించింది. పెనం దగ్గిరకి పోయినప్పుడల్లా వాళ్లు కాల్చుకొని కోతిగంతులు వేశాడు. వంట చేస్తున్నంతసేపూ గంతులు వేస్తూనేవున్నాడు. మొదట్లో వంటచేసేవాళ్లు పొయ్యిచుట్టూ యిల్లా గంతులువేస్తే కాని ఆమ్లెట్లు రుచిగా తయారుకావు కాబోలు ననుకొన్నాం.

ఒక చెంప వాళ్లుకాలి వాడు గెంతుతుంటే, 'మాంట్ మొరన్సీ'గాడు తననెవరో పిలిచినట్లు తోక ఆడించుకొంటూ పోయి, పెనంమీద మూతిపెట్టింది. రోగం వదిలేలా ముట్టెఅంతా కాలిపోయింది. 'కయ్యో' 'కయ్యో' అని అరుస్తూ గింగిరాలు తిరిగిపోయింది. మొత్తంమీద వంట జరుగుతున్నంతసేపూ నాకూ, జార్జికీ చాలా సరదాగా వుంది. వంట ఐపోయాక అప్పుడే అయిపోయిందేమా అని కూడా అనిపించింది.

పోనీ—పడ్డశ్రమ ఎలాగూ పడ్డాం, తయారైన వంటకం అయినా బాగుంటుందేమో నని ఆశపడ్డాం ఆ ఆశా, నిరాశఅయింది. పెనం మీదిదంతా కలిసి అరంగుళం మేర మాత్రం ఏదోనల్లగా మసిబొగ్గు పామినట్లుంది. అక్కడికీ కక్కుర్తిపడి నోట్లో పెట్టుకొంటె వెళ్లు కొచ్చింది.

అంతా ఐపోయాక ఆమ్లెట్లు వెయ్యటానికి యీ మాదిరిపెనం పనికిరాదనీ, యింకేదో మాదిరిది వుంటే కాని కుదరదనీ హారిస్సు అన్నాడు. ఈసారి ఆమాదిరి పనిముట్లు అన్నీ వున్నప్పుడే ఆమ్లెట్లు జోలికి పోదాంలెమ్మని అప్పటికి అందరమూ సరిపెట్టుకు వూరుకొన్నాం.

మా ప్రొద్దుటి ఫలహారాలు పూర్తి అయ్యేసరికి ఎండ కొంచెం చురుకు ఎక్కింది. ఈదురుగాలి వీచటం తగ్గిపోయి, వాతావరణం హాయిగా వుంది. మేము అప్పుడు వున్న 'మాగ్నా కార్టాలంక'లో ప్రస్తుత కాలాన్ని స్ఫురణకు తెచ్చే చిహ్నం ఏదీ లేదు. శూన్యంగా చూస్తూవుంటే నా మనోనేత్రాల ముందు గతశతాబ్దాల నీలితెరలు తొలగిపోయి, 1215 లో కింగ్ జాన్ 'మాగ్నకార్టా పత్రం' పై సంతకం చేసిన దృశ్యం ప్రస్ఫుటంగా నిలిచింది. ఈనాటికీ ఇంగ్లీషు ప్రజల పౌరస్వత్వాలు మన్నించబడుతున్నాయంటే దానికి కారణం ఆనాడు యింగ్లీషు బారన్లు అందరూ కలిసి కింగ్ జార్జిచేత బలవంతంగా మాగ్నాకార్టా పత్రంపై సంతకం చేయించినందువల్లనే. ఇంగ్లండు దేశ చరిత్రలో యింత ప్రధానమైన యీ ఘట్టం, అప్పుడు మళ్లా నాకోసం జరుగుతున్నట్లు ఆనాటి సంఘటనలకు నేను సాక్షీభూతంగా నిలచి వున్నట్లు విచిత్రమైన మానసికానుభూతిని పొందాను.

## 12

ఆ విధంగా నేను ఏదో వూహాప్రపంచంలో విహరిస్తూ వుండగా, జార్జిగాడు నా భుజంమీద తట్టి,



# ముచ్చటగా ముగ్గురు



'కళ్లు అప్పగించి చూస్తూ కూర్చోకపోతే, తిండి తిన్న బొచ్చెలు తోమటంలో కాస్త సహాయం చెయ్యకూడదా'అని అడిగాడు. గడచిపోయిన యుగాలలో బ్రతుకుతున్న నన్ను, వీడు అమాంతంగా పేలవమై, నిర్జీవమై, నిలచిపోయిన వర్తమానకాలంలోకి బలవంతంగా గుంజి పడేశాడు. ఒక్క నిట్టూర్పు విడిచి, బోటులోకి ఎక్కి, అట్లపెనం తీసుకొన్నాను, తోమటానికి. క్రపెళ్లు ఎండు గడ్డితో పెనానికి పట్టిన మసినంతా తోమేసి నీళ్లతో కడిగి, పక్కనే జార్జిగాడి చొక్కా వుంటే, దాంతో పెనానికి కాస్పేపు పాలిష్ పెట్టాను.

అక్కడనుంచీ ముగ్గురమూ కలిసి 'మాగ్నా కార్టా లంక'లోకి నడిచి వెళ్లి, అలనాడు కింగ్ జార్జి కూర్చున్న రాతిని చూశాం.

ఎనిమిదవ హెన్రీ, ఆయన ప్రియురాలు 'ఆనీ బొలిన్'కలిసి విహరించిన చరిత్రప్రసిద్ధమైన స్థలులాగా ప్రఖ్యాతిపొందిన చోట్లు ఒకటి రెండు అక్కడికి దగ్గరలో వుంటే,వాటినికూడా చూశాం.నిజానికి ఎనిమిదో హెన్రీ ఆపిల్లతో కలిసి తిరగని చోటుఅంటూ ఎక్కడా లేదని అంటే, అందులో ఆశ్చర్యం ఏమీలేదు. కొత్తగా ప్రేమించు కొన్నవాళ్లతో సామాన్యంగా ఎప్పుడూ యిదేపేచీ వస్తుంటుంది. సర్వాంతర్యాముల్లా వాళ్లు ఎక్కడపడితే అక్కడే వుంటూ వుంటారు.

'పాత విండసర్' దాటాక మళ్లీ 'బోవెనీ' చేరే దాక నది ఆట్టే అందంగా వుండదు.

నేనూ జార్జి కలిసి 'హామ్‌పార్కు'వరకు నడవలాగాం. 'డాచ్చెట్' దాటుతుండగా 'కిందటిసారి యిక్కడ జరిగిన సంగతి నీకు జ్ఞాపకం వున్నదా?' అని జార్జి నన్ను అడిగాడు.

అప్పటి అనుభవాలు మరుపు రావటానికి నాకు యింకా చాలాఏళ్లు పట్టుతుంది.

మరునాడు బ్యాంకుకి సెలవరోజు అనగా, ఒక శనివారంనాడు మేము ముగ్గురం, యిదివరకొకసారి యిలాగే, అద్దెబోటులో థేమ్స్‌నదిమీద విహారానికి బయలు దేరాం.'డాచ్చెట్' దగ్గరకు వచ్చేసరికి రాత్రి పదిగంటలైంది. ముగ్గురమూ అలిసిపోయివున్నాం. అప్పుడూ యిల్లాగే బోలెడంత సామాను తెచ్చుకొన్నాం. ఒక పెద్ద గోనెసంచి, రెండు చేతి సంచులు, కంబళ్లు, కోట్లు వగైరా సామానంతా మోసుకొని వూళ్లోకి బయలుదేరాం. ఊరి మొగలోనే ఒక చిన్న హోటల్ కనిపించింది. హోటల్ చూడటానికి బాగానే వుంది. వాకిట్లో పూలచెట్లూ అవీ వున్నాయి కాని, వాటిల్లో మందార చెట్లు లేనందుకు నాకెందుకో మనస్సుకి కష్టం తోచింది: ఆహోటల్ అంటే అనహ్యాంవేసింది. ఏమైనా సరే అందులోకి పోవద్దన్నాను: దూరమైనా సరే వూళ్లోకివెళ్లి మందార చెట్లు వుండే హోటల్ యింకేదైనా వుంటే అందులోనే బసచేద్దామని పట్టుబట్టాను.

ఇంకొక హోటల్‌కి వెళ్లాం. అదికూడా అన్ని విధాలా బాగుంది: వాకిట్లో మందార పూలు గుత్తులు గుత్తులుగా వేళ్లాడుతున్నాయి. నాకు చాలా నచ్చింది. కాని ఆ హోటల్ వాకిట్లో నిలబడివున్న ఒకడి తల మీది రాగిజుట్టు మా హారిస్సుకి నచ్చలేదు. ఆమనిషి తొడుక్కొన్న జోళ్లనిచూస్తే తనకి వాంతి వస్తోందనీ, అలాంటి కచడా మనుష్యులు వుండే హోటల్లో తనలాంటి, మాలాంటి పెద్ద మనుష్యులు వుండకూడదనీ హారిస్సు అన్నాడు. ఇంకో హోటల్‌కి వెళ్దామని యింకా ముందుకు నడిచాం. ఎంతదూరం నడిచినా ఒక్కహోటలూ కనిపించలేదు. చివరికెవడో బాటసారి ఎదురైతే, ఆదగ్గిర్లో ఏదైనా హోటల్ వుందాఅని అడిగాం.

"హోటలా? ఈవూళ్లోవున్న రెండు హోటళ్లూ అటువైపే వున్నాయి వాటిని దాటి వస్తూ నన్ను అడుగుతారేం?" అని ఆయన ఆశ్చర్యపోయాడు.

ఆ రెండుహోటళ్లకీ వెళ్లామనీ, రెండూ మాకు లేనచ్చలేదనీ చెప్పాం.

"ఈ వూళ్లోవున్న హోటళ్లు ఆ రెండే! ఇప్పుడేం చేస్తారు మరి?" అన్నాడు ఆయన జాలిగా.

"ఏం దారి? ఇప్పుడేం చేద్దామంటావురా?" అని హారిస్సుగాడు తెల్లమొఖం వేసి జార్జిని అడిగాడు.

ఉన్న రెండు హోటళ్లకీ చెరొక వంకా పెట్టినందుకు జార్జిగాడికి మాయిద్దరి మీదా యిందాకటి నుంచీ వొళ్లు మండుతున్నట్లుంది. సమయం దొరికింది

కదా అని అదంతా యిప్పుడు వెళ్లబెట్టాడు. మా యిద్దరినీ కలిసి మాకు నచ్చేటట్లు ఒక హోటల్ కట్టించుకోమనీ, మాకు నచ్చేవిధంగా కొందరు మనుష్యులని కూడా తయారుచేయించి అందులో అట్టేపెట్టించుకోమనీ మమ్మల్ని తిట్టిపోశాడు. తానుమాత్రం మొదట వెళ్లిన హోటల్‌కి పోతున్నానన్నాడు.

ఆదర్శాలు, అభిమానాలు పెట్టుకు బ్రతకాలనే వాళ్లకి యిలాగే అడుగడుగుక్కీ అవమానాలు తప్పవు కదా అని నేనూ హారిస్సూ కూడా కాస్సేపు నిట్టూర్చాము.

దేవుడా అంటూ జార్జితోపాటు సామాను మోసుకొని మొదటచూసిన హోటల్‌దాకా నడిచి వెళ్లి సామానుఅంతా హోటల్ మెట్లమీద దింపుకొన్నాం.

హోటల్ యజమాని యివతలికి వచ్చాడు. ఈ రాత్రికి మా ముగ్గురికీ మూడు మంచాలు యిప్పించమని అడిగాం. హోటల్ యజమాని తన హోటల్‌లో ఖాళీలు లేవన్నాడు. మూడు మంచాలు ఖాళీ లేకపోతే, రెండైనా సరే యిమన్నాడు జార్జి.

రెండు కాదు కదా, అరమంచమైనా ఆరోజు ఖాళీలేదనీ, అప్పటికే ఒక్కొక్క మంచం మీద యిద్దరిద్దరూ, ముగ్గురు ముగ్గురు కూడా పడుకొన్నారనీ హోటల్ యజమాని చెప్పాడు.

మాకు తలతిరిగి పోయినంత పనిఅయింది. జార్జిగాడికి ఎల్లాగైనా యిట్లాంటి వాటిలో అనుభవం ఎక్కువ. పోనీ మంచాలు లేకపోతే మానె, ఆబిలియర్డ్ రూమ్‌లోనైనా కాస్త చోటువుంటే చూపెట్టమని అడిగాడు. అప్పటికే ఆగదిలో ఆరుగురు, బిలియర్డ్ బల్ల మీద పదిమందీ' మొత్తం పదహారుమంది పడుకొన్నారని హోటల్ యజమాని వాపోయాడు.

గత్యంతరంలేక మళ్లా సామానంతా నెత్తికెత్తుకొని రెండో హోటల్‌కి వెళ్ళాం. నామటుక్కి నాకు మొదటి హోటల్‌కంటే యిదే చాలా బాగుందనిపించింది. ఆమాటే పైకి అనేశాను. ఇందాక అక్కడ నిలబడ్డ మనిషిని చూసి ఏవగించుకొన్న హారిస్సుకూడా, యింత అనుభవం జరిగాక, యిప్పుడు తనికీ యీహోటల్ నచ్చిందన్నాడు. ఆరాగి బొచ్చు మనిషి ఎదురైతే కళ్లు మూసేసుకు గడిపేస్తాను లెమ్మన్నాడు. దేవుడు పెట్టిన రాగిబొచ్చుకి ఆమనిషి మాత్రం ఏ చేస్తాడు లెమ్మని తననితాను ఓదార్చుకొన్నాడు. [sic: ఊరడించుకొన్నాడు]

గుమ్మమైనా మేము సొంతం ఎక్కకముందే హోటల్ యజమానురాలు యివతలకి వచ్చి, యిప్పటికప్పుడే తను పదమూడు జట్ల అతిథులకి చోటులేదని చెప్పి పంపించానన్నది. తన హోటల్‌వున్న మూడు మంచాలకీయిద్దరు దంపతులు, ముగ్గురు బ్రహ్మచారులు పోటీ పడుతున్నారని చెప్పుకొస్తుండగా, మా సొదఅంతా పక్కనుంచీ వింటున్న పడవలవాడు ఒకడు, యిందాక మేము వదిలిపెట్టి వచ్చిన హోటల్‌కి పక్కగావున్న పచారీ షాపులో ఏమైనా బస దొరుకుతుందేమో చూడమని సలహా చెప్పాడు.

అక్కడికి వెళ్లి కనుక్కొంటే అక్కడా చోటులేదు. కాని అక్కడవున్న ఒక ముసలమ్మ యివతలకి వచ్చి రెండు ఫర్లాంగుల దూరంలో తనకు తెలిసినవాళ్లు ఎవరో వున్నారని, వాళ్లయింట్లో గదులు అప్పుడప్పుడు అద్దెకు యిస్తుంటారని చెప్పి, మాతోపాటు తనుకూడా బయలుదేరి వచ్చింది. ఆయింటికి వెళ్లటానికి అరగంట పట్టింది. దారి పొడుగునా యీముసలమ్మ తనకి ఎన్నినిరకాల నడుము నొప్పులు వచ్చేదీ అదంతా చిత్ర విచిత్రంగా వర్ణించి చెప్పింది.

ఆయింట్లోనూ ఖాళీలేదు. 27 వ నెంబరు యింట్లో కనుక్కోమని అక్కడ ఎవరో సలహాయిస్తే అక్కడికి కెళ్లాం. అక్కడా ఖాళీలేదు. 32 వ నెంబరు యింట్లో కనుక్కోమని యింకొకళ్లు చెప్పితే అక్కడికి వెళ్లాం. అక్కడా ఖాళీ లేదు!

దాంతో మాకు ముగ్గురికీ చెడ్డ విసుగు వచ్చేసింది. రోడ్డు నట్టనడానికి పోయి హారిస్సుగాడు గోనెసంచీ దభేలున పడేసి, దానిమీద కూర్చుండిపోయాడు. తనకిక ఆఖరుక్షణాలు వచ్చేశాయనీ, చావటానికి యింతకంటే మంచిచోటు తనకి దొరకబోదనీ అన్నాడు. చచ్చిపోబోయేముందు తన తల్లిని తలుచుకొన్నాననీ బంధువులందరినీ మనస్సులో మన్నించాననీ అందరితోనూ మిమ్మల్ని చెప్పెయ్యమన్నాడు.

(58-వ పేజీ చూడండి)



శ్రీ [illegible] రాజు

ఆ దేవాలయానికి ధర్మకర్త లెవరో తెలియదు మొండి గోడలమీద నాగుజెముడు కంప ధర్మకర్తృత్వం పాడుబడ్డ బావి చుట్టూ జిల్లేడుపొదల ధర్మకర్తృత్వం ఎటుతిరిగీ, నగం విరిగిన ధ్వజస్తంభం చుట్టూవున్న కాస్త ఖాళీస్థలమే పూరిపిల్లలకు మిగిలింది

అప్పటికప్పుడే పమిడి వాళ్ల బ్బాయి - బుచ్చి వచ్చి ఛేర్ కట్టేసు గీచి, ఉప్పందుచ్చే ఆటకు సన్నాహాలన్నీ పూర్తిజేస్తున్నాడుగాని వెనక వచ్చిన అలివేలుకొడుకు తక్కిన పిల్లలందర్నీ కలుపుకొని— "ఉప్పాట వద్దురా, బుచ్చీ! ఆలెంకా లెంక ఆడుకుందాంరా" అన్నాడు "ఆలెంకాలెంక' లోనే బుచ్చిలంకె వున్నది సత్తరగాయగా వుండి చెడుగుడులో పిల్లలవీపు చెటచట మనిపించగల బుచ్చి, "నిల్చాంకే తన్నులాట"లో హనుమంతు మోకాలు విరగదన్నిన బుచ్చి, చెరువులో ఆ గట్టునుండి యీ గనుముదాకా మూడుసార్లు ఏక దమ్ములో యీదన బుచ్చి—ఆ లెంకాటనే జనుస్తాను గీటుదాటి పోకుండా తనతోటి వాళ్లు పట్టుకొన్నప్పుడు తనకు చక్కలిగిలి

"వద్దులేరా, మంగా! యివ్వాళ్టికి వుప్పాట"

మంగన్న మోచేయిఝాడించి, రెండవచేత్తో చూపుతూ "గెలవలేని కుక్క, గయ్యాళికుక్క—" అని పదం పాడడు తక్కినవాళ్లంతా వంతందుకొని గేళిచేసి పెద్ద కేకలు వేయ సాగారు బుచ్చికి తండ్రి లేడు అందుకని యీ వెధవంకంతా అంత అలుసు తన సమవుజ్జీ మంగిన్నగూడా యివ్వాళ గుంపుతో కలిశాడు

మూతివిగించి, జుట్టుపైకి విదిలించుకొని, తొడలుగొట్టి కోపపు కళ్ళతో బుచ్చి, గ్యాంగుమునుచూసి—"అయితే రండిరా, సవ్వాల్! నన్ను ఔటుచెయ్యాలిరా యెదవల్లారా! కొబ్బరికాయ పందెం—" అని ఎదిరించాడు

బుచ్చికి చక్కలి గిలి పెట్టి మంగన్నే ఔటుచేశాడు పిల్లలందరూ—"కొబ్బరికాయ, కొబ్బరి కాయ" అని అరిచారు

"అన్యాయం జేశారు చక్కలి గిలి పెట్టకుండా రండిరా చూద్దాం"

• "అహా!! అహా!! అన్యాయం లేదు, గిన్యాయంలేదు కొబ్బరి కాయ కావాల్సిందే"

బుచ్చి, గూపువంక ఎదురుతిరిగి చూశాడు తన్ను ఔటుచేసిన మంగన్నగాడు యీ ఆర్భాటం చెయ్యటం మిగతావాళ్లు బుచ్చి మళ్లీపళ్లు బిగబట్టాడు నేలమీద వుమ్మివేసి — "సిగ్గులేని నోళ్లు" అన్నాడు పెద్దగా అని ఆగలేదు. పాడుబావి చుట్టూవున్న జిల్లేడు గుబుల్లుదాటి, అవలీలగా అవతలికి దూకి, భల్లూకం తాటిచెట్టెక్కినట్టు, కనుమూసి తెరిచేలోపల కొబ్బరిచెట్టెక్కి కాయలు విదిలించేశాడు ఒకటిగాదు ఒకగెలకు గెలే తెగిపడ్డది ఎవరికి దొరికినవి వాళ్ళేరుకొని పిల్లలందరూ పారిపోయినారు.

మంగ ఒక్కడే పట్టెచేతుల్తో నిలబడ్డాడు, బుచ్చి చెట్టు దిగేవరకూ.

బుచ్చికి మంగమీది కోపమంతా పోయింది సంజచీకట్లో మంగవంక చూశాడు "ఒరేయ్, నావళ్లు చూడరా. జొరంవచ్చినట్టుంది. ఈగాట్లన్నీ చూస్తే మా అమ్మ చెల్లెక్కానని పసిబట్టుందిరా"

నిజమే, బుచ్చి వళ్ళు మండిపోతున్నది

## 2

మర్నాడు ఛెర్ పట్టీలు ఆడటానికి బుచ్చి రాలేదు

"అరేయ్, బుచ్చేడ్రా యివ్వాళ? బళ్లోగ్గూడా రాలేదు" పిల్లల్లో ఎవరికి వాళ్లు అడిగారు గాని సమాధానం రాలేదు.

"నేం బోయి చూస్తానుండండిరా" అని మంగన్న కుమ్మరివీధి గుండా పరుగెత్తిపోయాడు ఆ రోజున ఆటల్లో జోరులేదు మీదు మిక్కిలి నిన్న కొబ్బరికాయలు దొంగతనానికి శివార్చకుడు వియ్యన్న ఆటలాడవచ్చిన వాళ్లను తరిమికొట్టి పంపించాడు.

మంగన్న యింటికి బోయేటప్పటికి అలివేలు పొంత్తకుండలో నీళ్లు తోడి ఎదురుచూస్తున్నది

"ఎక్కడకు జచ్చావురా నీ శిరసుమండ దెయ్యాలు దిరిగే వేళవరకు నీకేం యవ్వారం యేడ్చిందిరా మంగా"

"కాదే, అల్లబుచ్చిని జూడబోయినానే"

"ఓరి నిన్నుకిందబెట్ట నీకేం పోగాలంరా. బుచ్చికి మసూచికం అని వూర్తూ, వాడ మోగిపోతూంటే నువ్వెందుకు జచ్చావురా?"

ఈమాటు ఆ వాగ్ధోరణికి మంగన్న మాట్లాడలేదు తండ్రి వచ్చేవేళకు బుడ్డిదీపం ముందు ఎక్కాల పుస్తకం తీసుకొని కూర్చొని కునికిపాట్లు పడి నిద్రబోయినాడు.



"అయితే రంపెడ్రా సవాల్ కొబ్బరికాయ పందెం"

#  ఇద్దరు పిల్లలు 

## 3

మంగన్న కేమీ తోచలేదు. ఆరోజున పెద్ద ఎక్కం అప్పజెప్పలేక దెబ్బలు తిన్నాడు. దానికి తోడు శంకరయ్య పంతులు జెప్పిన వేమనశతకం పద్యానిగ్గూడా, నోరు తిరగక, చింతబెత్తం వాతలు తగిలించుకొన్నాడు. మొన్న బుచ్చిని గేలిచేసిన గ్యాంగంతా, ఆ రోజున మంగమీద కొత్తపదం గట్టింది. "మంగా, తుంగా, బుఱ్ఱలేనికొంగ. మంగ తుంగ బుఱ్ఱలేని కొంగ. మంగ తుంగ బుఱ్ఱలేని కొంగ."

మంగ ఆరాతుసి మూలనుండి పారిపోయాడు. చెవుల్లో గింగురుమని తుంగపదం మోగగా, అవమానం భరించలేక, ఏమీ చెయ్యలేక చాటుకెళ్ళి ఏడ్చాడు. తనూ, బుచ్చీ ఏకమైతేనా? యీగుంపును గుంపునంతా తిప్పించి, మళ్ళించి తన్ని వుండును. కాని బుచ్చే లేడు. వాడు లేకపోతే బడిలో సందడీ లేదు. గుళ్లో అందమూ రాదు. మంగ బుచ్చిని చూడబోయినాడు. రాత్రి అలివేలు తిట్లు జ్ఞప్తి వున్నవిగాని, యీ చీకట్లో తన్నుచూసే దెవర్లే!

కుక్కిమంచంలో బుచ్చి కలత నిద్రబోతున్నాడు. వాళ్లమ్మ ఏడుస్తున్నది. పొడివళ్లు పేలుతున్నది. వంటినిండా పెద్దపెద్ద బుడిపెలుగా కాయలులేచినవి. మంగకు భయం వేసింది. జాలి కళ్లను కప్పేసింది. కళ్లు మూసుకొనే—"బుచ్చీ" అని పిలిచాడు— వాళ్ళమ్మ వద్దన్న మాటలు వినిపించుకొనిగూడా.

బుచ్చి కళ్లమీదగూడా తెల్లకాయలే వున్నవి. కళ్ళెత్తి చూసి కొద్దిగా మూలిగి, బుచ్చి మంగ వంకచేయి జాచాడు. మంగన్నకు వళ్లు జలదరించింది. ముచ్చెమటలు పోసినవి. మొన్న నాలుగురోజుల నాడు కొబ్బరిచెట్టెక్కి ఫెళాఫెళా కాయలు రాల్చిన బుచ్చి అడుగో.

బుచ్చి యింతలోనే కలవరించాడు.

"అరేయ్! గాదెలో కందిపప్పు. గాదెకింద పందికొక్కు. ఈమాటలు పదిసార్లన్నా తెలుస్తుంది నీ తెలివి."

మంగన్న బాగా విన్నాడు. "అరేయ్, నేన్రా బుచ్చీ!" అని మంచంమీదికి వంగాడు. తన బొమ్మ బుచ్చికళ్ళల్లో కనిపించింది మంగన్నకు. వాడి కలవరింతమాటలకు ఒళ్లు వణికిపోయింది. మంగన్న కాలికి బుద్ధి చెప్పాడు.

## 4

ఆ రాత్రి వాడికి అన్నం సయించలేదు. పైగా తండ్రివచ్చి, అలివేల్ను చెడాబడా బాదాడు. అలివేలు దెబ్బలతోనే మూలిగి నిద్రబోయింది. మంగ భయం తీర్చేవారు లేకపోయినారు. రాత్రి ఎంతసేపటికీ నిద్రబట్టలేదు. బుడ్డిదీపాన్ని తన్ని, తండ్రి వెళ్లిపోయినాడు. చీకట్లో తిరిగి తిరిగి బుచ్చిమాటలే వాడికి గుర్తుకొచ్చినాయి. "గాదెలో కందిపప్పు. గాదెకింద పందికొక్కు" అని గబగబా అనుకోబోయినాడుగాని కందిపప్పు చోట—పందికుక్కు, పందికుక్కుచోట కందిపప్పు తడబడ్డవి. మళ్లీ ప్రయత్నించాడు. కాని, మళ్లీ అంతే. బుచ్చి యిదివరగ్గూడా యిట్లాంటివే చాలా చెప్పేవాడు బళ్లో. అందులో ఒకటి యింకా జ్ఞాపకం వుంది "రోజూ మామేకకు మోపెడు తురకవేపాకు. రోజూ మామేకకు మోపెడు తురకవేపాకు" యిది పదిసార్లు గాదుగదా నాలుగుసార్లన్నా దబదబ్బున తప్పులుపోకుండా ఎవ్వరూ అనలేకపోయారు. వాడు చదుగుడులో ఎంతదిట్టో, కట్టు కథల్లోగూడా అంత గొప్ప. ఏం కట్టు కథలని? విప్పలేని కట్టుకథలు వాడొక్కడికే తెలిసిన కట్టుకథలు.

## 5

పొద్దున్నే అలివేలు లేచి, పేడకళ్లాపి విసిరి విసిరిచల్లుతూ, రాత్రి తగిలిన దెబ్బలన్నీ మరిచిపోయి— "ఓరి నీజిమ్మబీక, మాయదారి మంగా! రాత్రి యేడకు జచ్చావురా? మళ్లీ ఆ బుచ్చిగాడింటికేనా? మొన్న నీకు గడ్డిబెట్టలేదంటరా? నిన్ను వూరవతలికీడవా! నిన్ను తలారిరాముడు మింగా. ఆడకు మళ్ళీ జావకురా!!! నీకొస్తే నేజెయ్యలేను. ఆ శ్లి భద్రయ్య జూడరా. గుంటమొగం భద్రయ్య ఆయన మొగం అయిపోద్దిరా నీగ్గూడా" అని కళ్లాపితో శాళం వేస్తూ మంగన్నను నిద్రలేపింది.

మంగ ఒక్కదూకుతో అలివేలును తప్పించుకొని నిద్రమొఖంతోనే వీధిలోకి తప్పించుకొన్నాడు. అలివేలు ఎన్నితిట్లు తిట్టినా నిజమే మాట్లాడుతుందని తెలుసు. ఏకాఏకిని పులుసు భద్రయ్య యింటిదాకా నడిచివెళ్ళిన వాడు అక్కడ

టక్కున ఆగిపోయాడు మంగ.

పులుసు భద్రయ్యా అప్పుడే మేలుకొన్న కంటితో అరుగుమీద వేపపుల్ల నములుతూ, కూర్చుని వున్నాడు. మంగ ఆగి దీక్షగా జూచాడు. భద్రయ్యకు ఒక్కటే కన్ను. అదైనా పువ్వుబూసిన తెల్లగవ్వకన్ను. అతని ముఖం నిండా, ముక్కుమీద లోతు మచ్చలున్నై. అంత చలిలోనూ మంగకు చిరుచెమటలు పోసినవి. భద్రయ్యకు కోపంవచ్చి "ఎవ్రడా, ఆ వెక్కి జూసేది?" అని కీచుగొంతుతో నిదిలించుకొన్నాడు.

మంగ వచ్చినదారినే వెనుదిరిగాడు. కాని కాళ్లు పక్కసందులోకే లాగినవి. అవును, ఆసందులోనే బుచ్చియిల్లు.

బుచ్చితల్లి దేవతలకు, దేవర్లకు చద్దిదీస్తున్నది. పెద్దమ్మారుతల్లికి మొక్కుకొంటున్నది. ఆమెను చూడకుండానే మంగ మెల్ల మెల్లగా బుచ్చిమంచం మీదుగా వెళ్ళి, వాడికళ్ళల్లోకి చూచాడు. నిన్నకంటె పెద్దవైనవి కాయలు. తెల్లగా సానతో మెరిసిపోతున్నవి. మంగకు పులుసు భద్రయ్యా కనిపించాడు ఆకళ్ళలో. "బుచ్చీ!" అన్నాడు. ఆపిలుపుకు బుచ్చి కళ్లు తెరవబోయి తిరిగి మూసుకొన్నాడు.

**6**

ఆరాత్రి అలివేలుచేత దెబ్బలు తిన్నాడు. తినిగాని నిద్రబోలేదు. పొద్దున్నే బారెడు ఎండవచ్చినా లేవలేదు.

"మంగా! అరి నీ నిద్ర చావు నిద్రగాను. లేవరా. నీముఖాన కట్టెలు బెట్ట" అలివేలు దగ్గరకు వచ్చిలేపింది. మంగ ముసుగులో వున్నాడు

అలివేలు విసురుగా ముసుగు తీసేసి, జుట్టు బట్టుకోబోయిందిగాని వాడికళ్లు జూచి ఆగిపోయింది. "అయ్యో, నాబిడ్డా!" అని మంగను, సవతికొడుకు మంగను, కావిలించుకొన్నది.

* * *

మంగ జ్వరం తగ్గలేదు. కళ్ళమీద తెల్లకాయలు ధగధగ మెరిసి

(43-వ పేజీ చూడండి)

# ప్రాప్తం

శ్రీ పాలంకి
వెంకటరామచంద్రమూర్తి

చెంగల్పట్టులో శేషావతారమనే జడ్జీ గారుండే వారు.

సాధారణంగా ప్రతీ జడ్జీకీ ఒక మోటారుకారు ఉంటుంది. తమకు కారు అవసరం లేదనీ, కేవలం హోదాకోసం కొనుక్కోడం దండుగనీ అభిప్రాయపడి, శేషావతారంగారు మాత్రం కొనుక్కోడం మానేశారు.

అవతారంగారు బజారుపని కూడా స్వయంగానే చూసుకునే వారు. సరుకు నాణ్యం చెయ్యటం లోనూ, బేర మాడటంలోనూ తనకున్న నేర్పూ శ్రద్ధా పైవాళ్ల కుండదన్న అభిప్రాయంతోనే ఆయన ఆపనికి పూనుకునే వారు.

ఒకసంవత్సరం దీపావళి పండుగ దగ్గిర పడుతోందనగా పేపర్లో ఒక ప్రచురణ పడింది. చెన్న పట్టణంలో ఒక కంపెనీ వాళ్లు "దీపావళికి బట్టలన్నీ సగానికి సగం వెల తగ్గించి అమ్మబడును" అని ప్రకటించారు.

శేషావతారంగారు ప్రతీయేడూ దీపావళికి బట్టలూ, బాణసంచా చెంగల్పట్టులోనే కొనేవారు. 'సగానికి సగంవెల తగ్గింపు!' అన్న ప్రకటన చూడటంతో ఆయన కాయేడు పట్నంవెళ్లి కొనటం లాభమని తోచింది.

దీపావళి రేపుఅనగా పట్నం వెళ్ళి ఆ షాపులో భార్య భగీరథమ్మగారికి ఒక బణారసు పట్టుచీరా, కుమార్తె కోమలకు ఒక రెడీమేడు సిల్కు గౌనూ, పట్టు పరికిణీ కొన్నారు.

"అమ్మగారికీ, అమ్మాయిగారికీ తీయించారు కాని తమమాట మరిచిపోయారు!" అంటూ షాపు వాడు సేలంసిల్కు పంచలూ ఖండువాలూ తీసి ఆయనముందు పడేశాడు. జడ్జీగారు "నాకువద్దు" అనబోయాడు కాని, "అందరం కొత్త బట్టలు కట్టుకుంటే మీరు ఆపాత వాటితో ఉండాలని ఎలాగ తోచిందండీ?" అని భగీరథమ్మ కూక లేస్తుందేమో అనిపించి; "పట్టువంటే నాకు మోజులేదోయ్, నూలువే రకాలు చూపించు" అన్నారు. అనటం తడవుగా షాపు వాడు సన్నరకాల జరీ చాపులు తీసి ఆయన వద్దంటోన్నా వాటిలో మిక్కిలీ విలువైన చాపునే కొనిపించాడు. మొత్తమంతా చేరి రెండువందల ఐదురూపాయలు బిల్లు ఐంది. శేషావతారం గారు ఆపై ఐదు రూపాయలూ కొట్టించేసి రెండు వందలూ ఇచ్చి బట్టల సంచీతో బయటపడ్డారు.

అపుడాయనకు పట్నంలోనే సేతుపేటలో కాపురంఉన్న తన చెల్లెలు శ్యామలాంబ జ్ఞాపకం వచ్చింది. ఆయనకు జడ్జీ పనియైన కొత్తలో చెల్లెలికొక సిల్కు చీర కొని ఇవ్వాలనే సంకల్పం కలిగింది. కాని ఏకారణంచేత నైతేనేం ఇంత వరకూ అది నెరవేర లేదు. ఆనాడు ఆమెకు కూడా ఒకచీర కొనేస్తే తీరిపోతుందనుకుని తిరిగీ షాపు ప్రవేశించారాయన. అప్పుడే ఆయనకు మరొక ఆలోచన కూడా అడ్డు తగిలింది. "మీ చెల్లెలికి చీర తెచ్చావుకాని నాకు చాపు తెచ్చావు కాద"ని బావగారు ఎగతాళి చేస్తాడేమో! కనుక ఆయనకు కూడా ఒక చాపుకొనక తప్పదు. కాని అప్పటికే రెండువందలైపోయింది. ఇప్పుడింకొక సిల్కు చీరతోబాటు చాపుకూడా కొంటే బిల్లు చాలా ఐపోతుంది. ఒకపని చేస్తేసరి. చీరాచాపూ నూలువే కొంటే తీరిపోతుంది.

షాపువాడు ఆయనకొన్న నూలుచీరెనూ, చాపునూ కూడా పట్టు బట్టలున్న మొదటిసంచీలోనే ఇముడుద్దామని చూచాడు కాని శేషావతారంగారు "అవి మరొకరికి పంపించాలి. వేరే సంచీలో పెట్టు" అన్నారు. దానికైన ఏభైయొక్క రూపాయి బిల్లు చెల్లించి రెండు సంచులూ పుచ్చుకొని బయట కొచ్చారు.

ఇవతల కొచ్చి మైనా బజా రమ్మట వెడుతోంటే ఆయనకు ఒకచోట రంగు రంగుల రిబ్బన్లూ జేబురుమాళ్లూ కుప్పలుగా పోసి అమ్ముతూ కనపడ్డాయి. చవగ్గా ఉన్నాయని తోచి నాలుగురకాల రిబ్బన్లూ, అరడజను రుమాళ్లూకొని వాటిని ఆయన పట్టుబట్టలున్న సంచీలో భద్రపరిచి బస్సుకోసం ఎదురు చూశారు.

చెంగల్పట్టులోనే వకీలుగా ఉంటూన్న రఘురామయ్య అనే ఆయన తనకారులో పోతూ జడ్జీగారిని చూసి, కారు ఆపి, "దయ చెయ్యండి" అన్నాడు. "నేను సేతుపేటలో మా చెల్లెలింటికి పోవాలి. మీరు వెళ్లండి" అన్నాడు శేషావతారం. కాని రఘురామయ్య జడ్జీగారి ప్రాపకం ఎలాగైనా సంపాదించ దలచాడు గనుక "సేతుపేట వెడదాం పదండి నాకూ తొందరపనేం లేదు" అంటూ శేషావతారంగారి చేతుల్లోంచి రెండు సంచులూ అందుకుని ప్రక్కన పెట్టుకుని "ఎక్కండి" అన్నాడు. శేషావతారంగారికి అపుడింక ఎక్కక తప్పిందికాదు.



శేషావతారంగారు దీపావళికి బట్టలుకొంటున్నారు.

రఘురామయ్య తనకు తొందర లేదన్నాడు కాని కారుడ్రైవరుకి మాత్రం చెంగల్పట్టు త్వరగా చేరుకోవాలనే ఉంది. వాడు ఇంటికి వెళ్ళేకే తన పిల్లలకి బాణ సంచా కొనుక్కోవాలి. అందుచేత వాడు, "బాబూ, కారు 'ట్రబుల్' ఇచ్చేటట్లుంది. ఇంజను ఆపకుండా పోవాలి. ఆగిపోయిందంటే మళ్ళీ 'స్టార్టు' కావటం కష్టం" అన్నాడు. శేషావతారంగారు ఆమాట విని, "అట్లైతే ఇంజను ఆపనేవద్దు. మా వాళ్లతో నాకు పెద్ద పనేంలేదు. ఆసంచి వాళ్లింట్లో ఇచ్చి రావటవే." అన్నారు.

డ్రైవరు కారును జోరుగా పోనిచ్చాడు. శ్యామలాంబగారింటికి వెళ్లేలోగా జేబురుమాళ్లూ రిబ్బన్లూ పట్టుబట్టలున్న సంచీలో నుండి క్రిందకు దొర్లిపోయాయి. రఘురామయ్యగారు వాటిని తీసి పట్టుబట్టల సంచీలో పెట్టటానికి బదులు పొరబాటున రెండో సంచీలో పెట్టేశారు.

శ్యామలాంబగారి ఇల్లు రావటంతోనే డ్రైవరు దిగి "ఏది బాబూ, సంచి?" అన్నాడు తొంద



కమలా నెహ్రూ పార్కు (బొంబాయి)లో 'బూట్ హౌస్'
ఫొటో : శ్రీ డి. ఎల్. రావు—బొంబాయి.

తగా. "రిబ్బన్లూ రుమాళ్లూ ఉన్నది కాక ఆ రెండోది" అన్నారు శేషావతారంగారు. రఘురామయ్య చేసిన పొరబాటు శేషావతారం గారికేం తెలుసు? డ్రైవరు పట్టు బట్టల సంచీని పట్టుకువెళ్లి గుమ్మంలో కనపడ్డ కుర్రవానికిచ్చి చక్కా వచ్చి కారును పోనిచ్చాడు. తన తొందరలో వాడు ఆ సంచీని జడ్జీగారు ఇమ్మన్నారనైనా చెప్పేడు కాదు.

శేషావతారంగారు ఇంటికి చేరు కోడంతోనే భార్యతో "నీకు బనారసు పట్టుచీర తెచ్చాను" అంటూ మహార్బాటీగా సంచీలో చెయ్యి పెట్టి తీసేసరికి నూలుచీర పైకి చక్కా వచ్చింది! ఆయన నిర్ఘాంత పోయి, "సంచీ మారుగుడైంది ఆ డ్రైవరుగాడు ఒకదాని కొకటి ఇచ్చేశాడు!" అన్నాడు భగీరథమ్మ సంగతంతా తెలుసుకుని, మీ వాళ్లకి నాతో చెప్పకుండా బట్టలు కొన్నారన్న మాట! ఏం? నాతో చెపితే వద్దంటాననా?" అంటూ కళ్లకు నీళ్లు తెచ్చుకుంది.

"ఇప్పుడేం చెయ్యాలో చెప్పక పేచీకి దిగుతావేమిటి?" అన్నారు జడ్జీగారు.

"తూర్పు దిక్కుగా తిరిగి దణ్ణం పెట్టడమే! ఇంక చేసేదేముంది?" అంది ఆవిడ

"అదేమన్న మాట? పొరబాటు జరిగిందన్న సంగతి గ్రహించ లేనంత తెలివితక్కువది కాదు మా శ్యామల! వెళ్ళి వస్తాను" అంటూ ఆయన వెంటనే స్టాండుకు వెళ్ళి మద్రాసుపోయే బస్సు ఎక్కేడు.

రాత్రి పదిగంటలకు మద్రాసు చేరుకోవలసిన ఆబస్సు దారిలో ఇంజను పాడై ఆగిపోయింది. అది బాగుపడి ఆయన చెల్లెలు ఇల్లు చేరుకునేసరికి తెల్లవారింది. అప్పటి కప్పుడే వాళ్లంతా తలంట్లు పోసుకుని కొత్తబట్టలు ధరించేశారు! శేషావతారంగారు కట్టుకుందా మనుకున్న సన్ననూలు పంచె ధరించి కుచ్చెళ్లు మడత సర్దుకుంటూ వీధి అరుగున కూర్చున్న భావగారు భార్యతో "మీ శేషూ వచ్చాడే" అని పిలిచారు. ఆమె కట్టుకున్న ఆబనారసు చీర బరబరలతో ఎదురువచ్చి, "వచ్చావా అన్నయ్యా, ఈరోజున నాకు అన్నివిధాలా పండుగే! ఎవరో మాకు తెలియకుండా పట్టుబట్టలు పంపించారు! నువ్వేమో తలవని తలంపుగా వచ్చావు!" అంది.

శ్యామలభర్త ఉపాధ్యాయుడు. "ఈ పట్టుబట్టలూ జరీచాపూ నావద్ద ప్రైవేటు చెప్పుకుంటోన్న పిల్లవాడే పంపిఉంటాడు. జీతం పుచ్చుకోడం నాకు ఇష్టం లేదు. ఊరికే చెప్పించుకోడం వాళ్లకిష్టంలేదు. అందుచేత వాళ్లే గుప్తంగా ఈకానుక ఇచ్చిఉంటారు" అంటూ ఆయన తన గొప్ప; తన శిష్యుని గొప్ప వెల్లడిచెయ్యటం మొదలెట్టేడు.

శేషావతారం నిర్ఘాంత పోయాడు. "ఈబట్టలన్నీ నేను కొన్నవే! ఏం జరిగిందంటే—" అని

చెప్పబోయేసరికి శ్యామల అడ్డు వచ్చి భర్తతో "చూశారా, నేను చెప్పినదే నిజమైంది. 'మాఅన్నయ్యే పంపి ఉంటాడు' అని నేనంటే మీరు నమ్మలేదు" అంది.

"నేను నమ్మనిమాట నిజమేనోయ్ బావా. ఏమంటే ఇంత విలువైన బట్టలు పంపి మమ్మల్ని ఆశ్చర్య పరుస్తా వనుకోలేదు. ఈ చాపు ఎక్కడ ఏరేవో కాని బలే బాగుందోయ్!" అన్నాడు మేష్టరు గారు.

అంతలో వారి అమ్మాయి విశాలం సిల్కు గౌనూ, పట్టు పావడా ధరించి ఆ ఫెళ ఫెళలతో జడ్జీగారి ముందు ప్రత్యక్షమైంది. "మామయ్యకి దణ్ణం పెట్టవే!" అంది శ్యామల. ఆపిల్లతోపాటు తను కూడా అన్నగారికి ముందు సాష్టాంగం పడింది.

జడ్జీగారు చెల్లెల్నీ మేనగోడల్నీ మనస్ఫూర్తిగానే దీవించాడు. సంచీలు తారుమారైన సంగతింక ఆయన బయట పెట్టలేదు. చెల్లెలిచ్చిన భక్షణాల పొట్లాం పుచ్చుకుని చెంగల్పట్టు చేరుకున్నాడు.





(39-వ పేజీ తరువాయి)

పోతున్నవి. రాత్రింబగళ్లు ఒకటే కలవరించాడు.

"అలివేలూ, నా కళ్లే. అలివేలూ! పులుసు భద్రయ్యకళ్లే. అలివేలూ, బుచ్చికళ్ళే."

తండ్రి వచ్చి పక్కలో కూర్చొన్నాడు. "గాదెలో కందిపప్పు. గాదెకింద పందికొక్కు"

తండ్రికి వళ్ళు జలదరించి వెళ్ళిపోయ్యాడు. మళ్ళీ "రోజూ మా మేకకు మోపెడు తురక వేపాకు" అని తొందరగా పల్లించబోయి తికమకలు పడ్డాడు.

ఆరోజున అలివేలు యింటి మీదుగా బుచ్చిని తీసుకుపోయారు. అలివేలు, మంగకు, విసురుతున్నది, విసనకర్ర వదిలి వీధిలోకి చూడబోయినది. మంగ వేచి వుండి "ఏమిటే అలివేలూ?" అని ప్రశ్నించాడు. అలివేలు పరధ్యానంలో "బుచ్చి" అని చటుక్కున నాలిక కరుచుకొన్నది గాని - "చచ్చిపోయాడా?" అని మంగ ఆ వాక్యాన్ని పూర్తి చేసేటప్పటికి గుడ్లనీరు కుక్కుకున్నది.

మధ్యాహ్నానికి మంగకు తపన ఎక్కువైంది.

"బుచ్చికళ్ళు. భద్రయ్య కళ్ళు. నాకళ్ళు" అని పదే పదే కలవరించాడు. ఎన్నడూ లేనిది అలివేలును "పిన్నామా" అన్నాడు. "పిన్నామా - నేనూ బుచ్చీ ఆడుకొంటాం. పంపవే" అని కళ్ళు మూసుకొనే మారాం జేశాడు.

సాయంత్రం ఆటలవేళకు అలివేలు తన మొగుడికి కబురుచేసింది.

ఇంకొంచెంసేపటికి, దుప్పటి కప్పుకొన్న మంగకూడా, స్నేహితుడు బుచ్చి వెళ్ళినదిక్కుగానే ప్రయాణం చేశాడు.

* * *

దేవాలయంలో ... ఆరోజుకీ యీరోజుకీ పాడు పిల్లవాడు లేడు.





“ఇది నా షెల్, ఇది నా ఆశ’ అంటూ తన వ్రాయించిన చిత్రం చూచుకుని ఆనందిస్తున్న చందనరాజు
విజయా వారి జానపద చిత్రం “చంద్రహారం” లో ఎన్. టి రామారావు.



మద్రాసు ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి "రోహిణి"లో ఎస్. వరలక్ష్మి

ఫొటోగ్రాఫర్ నితిన్ బోస్ వద్ద అప్రెంటిస్ గా పని చేశాడు.

## "దో బిఘా జమీన్" నిర్మాత

# ★ బిమల్ రాయ్ ★

ఇరవై ఏళ్ళనుంచీ ఫిలింరంగంలో కృషి చేస్తున్న బిమల్ రాయ్ తనకృషికంతటికీ తలమానికమైన గొప్పచిత్రం "దో బిఘా జమీన్" ఇటీవల నిర్మించాడు. ఈచిత్రంతో ఆయన మన ఫిలిం రంగంలో అద్వితీయ వ్యక్తిగా పేరు పొందాడు. బహుశా ఆయనకి ఆ పేరు చాలకాలందాకా నిలిచి వుండే సూచనలు కనిపిస్తున్నాయి. మన ఫిలిం పరిశ్రమ ప్రపంచంలో రెండోస్థానం ఆక్రమించింది, కాని కళావిషయికంగా చాలా వెనుకబడివుంది. బిమల్ రాయ్ చిత్రం విదేశాల్లో విడుదల అయినప్పుడు కళావిషయికంగా కూడా మనకు ఉచితస్థానం లభింపజేసిన కీర్తి ఆయనకే దక్కుతుంది.

అద్భుతంగా నిర్మించబడి, అద్భుతంగా డైరెక్టు చెయ్యబడిన "దో బిఘా జమీన్" భారతదేశానికి, ముఖ్యంగా బిమల్ రాయ్ స్వరాష్ట్రమైన బెంగాలుకు గర్వకారణం.

ప్రొడ్యూసరుగా, డైరెక్టరుగా నేకాక బిమల్ రాయ్ కెమెరామాన్ గా కూడా ప్రతిభాశాలి. ఆయనకి ఫొటోగ్రఫీ విషయం అమితమైన శ్రద్ధాసక్తులున్నాయి. బాల్యం నుంచీ ఫొటోగ్రాఫర్ కావాలని కలలు కనేవాడు. ఈ కలల ప్రోద్బలంతో కాలేజీ విడిచిపెట్టి న్యూథియేటర్స్ సంస్థలో చేరి,



కాశ్యప్ ప్రొడక్షన్స్‌వారి "నయా ఘర్"లో గీతాబాలి

# ★ బిమల్‌రాయ్ ★

1943 లో బిమల్‌రాయ్ డైరెక్టరుగా కూడా పేరులోకి వచ్చాడు న్యూథియేటర్సు వారి బెంగాలీ చిత్రం "ఉదయేర్ పథే" అద్భుతవిజయం

అద్మీ" అనే హిందీ చిత్రం ఆ ఏడాదికల్లా ఉత్తమ చిత్రమని పేరుపొందింది

1950 లో బిమల్‌రాయ్ బొంబాయిలో నివాస మేర్పరచుకుని "మా," "బాప్ బేటీ" అనే రెండు చిత్రాలు తీశాడు మొదటిది విడుదలయింది రెండవది ఇంకా కొద్దిగా తయారుకావలసి వుంది

స్వతంత్ర నిర్మాతగా ఆయన తీసిన మొదటి చిత్రం "దో బిఘా జమీన్" చిత్రాన్ని "పరిణీత"తో పాటే డైరెక్టు చేస్తూవచ్చాడు "దో బిఘా జమీన్" ఈ ఏడాది వెలువడిన చిత్రాల్లో కల్లా పరిగణింప బడదగినదే కాక, ఉత్తమ భారతీయ చిత్రాల్లో ఒకటిగా ఎన్నదగినది ఆ చిత్రం కథకూడా బిమల్‌రాయ్‌కి అన్నివిధాలా తగినది ఎందుకంటే ఆయన వాస్తవిక కథలనే ఎప్పుడూ స్వీకరిస్తూ వుంటాడు.

కొత్త నటీనటులనుండి తారలను సృష్టించడమే ఆయన కిష్టం కొత్తవారైతే తన భావాల కనుగుణంగా నటింప జెయ్యడం తేలిక అని ఆయన అభిప్రాయం "దో బిఘా జమీన్" లో బల్రాజ్ సహాని, నిరూపరాయ్ మొదలైన యావన్మందీ బాగా నటించారని ఆయన విశ్వాసం

ఆయన రెండవ స్వతంత్ర నిర్మాణం "పడోసిన్" అనే హాస్యచిత్రం. ఈ నెలలో ప్రారంభం అవుతుంది బెంగాలీలో విజయం పొందిన "పాషేర్ బాడీ"అనే చిత్రం ఆధారంగా గల ఈ చిత్రం ఎస్ ముఖర్జీ డైరెక్టు చేస్తాడు ఇందులో అందరూ బొంబాయి నటీనటులే వుంటారు

('ఫిల్మ్ ఫేర్' లో పెట్రీషియా పెరీరా రచించిన వ్యాసం ఆధారంగా—)★

పుత్రజననోత్సవానందంలో తేలియాడుతూ కొలువుతీర్చిన మహారాజు (అమర్ నాథ్)
భరణీవారి జానపదచిత్రం "చండీరాణి"లో ఒక దృశ్యం.



"చండీరాణి" సెట్టుమీద—ఆర్ నాగేశ్వరరావు, అమర్ నాథ్

# ప్రముఖ నటుడు: బల్రాజ్ సహాని

"దోబిఘా జమీన్" చిత్రంలో రైతు పాత్ర ధరించి గొప్ప ప్రతిభావిశేషం కనబరచిన బల్రాజ్ సహానీ గడచిన ఏడేళ్లుగా నాటకాల్లోను, సినిమాల్లోను నటిస్తున్నాడు. ప్రతిభాశాలి అయినవాడు మొదట్లో నివురుకింద నిప్పులాగ అజ్ఞాతంగా వున్నా చివరికి పైకి వచ్చి తీరుతాడనేదానికి ఆయన చక్కని ఉదాహరణ.

ఒడ్డూ, పొడుగూ, అందం, సౌజన్యం, కులీనత, ఆత్మవిశ్వాసం కలిగి, చదువూ, సంస్కారం, హాస్యప్రియత్వం, సంభాషణాచాతుర్యం, బహువిషయ పరిజ్ఞానం

(50వ పేజీ చూడండి)

# ప్రశ్నలు..సమాధానాలు

శ్రీ గర్నెపూడి శోభన్ ఎడిసన్
—గుంటూరు

సినిమా ప్రపంచమునకు కీర్తుడగు రాజాజీ మొన్న మద్రాసులో జరిగిన ఫిలిం ఫెడరేషన్ను పోజరగుటలో ఆయన ఉద్దేశ మేమిటి?

—ఫిలిం ఫెడరేషన్ సభకు రాజాజీ తనంతట తాను రాలేదు ఫెడరేషన్‌వారే ఆయనను ఆహ్వానించారు సినిమా పరిశ్రమ పట్ల తన అభిప్రాయాలు వెల్లడించడానికి ఇంతకంటె మంచి అవకాశంరాదని ఆయన ఆహ్వానం అంగీకరించి వుంటారు

* * *

శ్రీ మట్టా వెంకట్రావు — జంషెడ్‌పురము

శ్రీ దాసు వామనరావుగారు వ్రాస్తూయున్న "కాలక్షేపం" అను వ్యాసములలో తరచు మనుచరిత్రలో యున్న ప్రవరుడు, వరూధినిని తెస్తూయుంటారు దీనికి కారణం తెలియజేస్తారా?

—మనుజ చరిత్ర కీలకం మనుచరిత్రలో ఉన్నదని వామనరావుగారిభావనకావచ్చు

* * *

ఈస్టిండియావారు తమ ద్వితీయ చిత్రం "పక్కింటి అమ్మాయి" కలకత్తాలో నిర్మించుటకు కారణమేమి?

—అది ఈస్టిండియా వారి ద్వితీయచిత్రం కాదు. ఆ కంపెనీవారు ఇరవైఏళ్ళనుంచీ ఎన్నో తెలుగుచిత్రాలు తీశారు. ఆకంపెనీ వారిది కలకత్తాయే.

* * *

శ్రీ. జి. వి. రమణారావు—తాడేపల్లిగూడెం.

ఆగష్టు 6 వ తేదీన మద్రాసు వాహినీ స్టుడియోలో సమావేశమైన ఫిలిం ఫెడరేషన్ ప్రభుత్వాన్ని పన్నుల భారం తగ్గించవలసిందిగా కోరింది. ప్రభుత్వ సహకారం ఉంటే ఫెడరేషన్ సభ్యులు నిర్మించే చిత్రాలు యిప్పటికంటె ఉన్నత స్థాయి నందుకోగలవా?

—ఫిలిం పరిశ్రమపై పన్నులభారం తగ్గించాల్సిన అవసరం ఉన్నమాట నిజమే. అంతకంటే ముఖ్యంగా, నిర్మాతలు నిర్మాణ వ్యయం తగ్గించుకోవలసిన అవసరంఉన్నది. ఇది పూర్తిగా ఆర్థిక సమస్య. దీనికీ మంచి చిత్రాల నిర్మాణానికీ సంబంధంలేదు. మంచి చిత్రం లక్షరూపాయల్లోనూ తీయవచ్చు, ఇరవైలక్షలలోనూ తీయవచ్చు. మంచి చిత్రం తీయడానికి ప్రభుత్వ సహకారం కాదు కావలసింది; మంచి కళాకారుల సహాయం.

* * *

శ్రీ వి. సుబ్బారావు—మద్రాసు.

త్రీ-డీ చిత్రాలను ఒక్క కన్నె వుంటే వారు చూస్తే ఎలా అగుపడుతుంది?

—మామూలు సినిమాలవలెనే కనిపిస్తుంది; త్రీ - డీ ఎఫెక్టు కనిపించదు.

* * *

శ్రీ కె. ప్రకాశరావు—మండపేట.

ఆంధ్రపత్రిక 17-6-58, సంచికలో "సైకిల్ థీవ్స్", చిత్రాన్ని సమీక్షిస్తూ



పారమౌంట్ వారి "మిలిటరీ పోలీస్‌మన్" అనే సంగీత, హాస్యచిత్రంలో బాబ్ హోప్, మేరిలిన్ మాక్స్‌వెల్, మికీరూని.

6 పేజీలు పొగిడిందేగాక, సుప్రసిద్ధ కొమెడియన్ వి. యస్. రెడ్డి, రహమాన్, రామనాథ్ గార్లని వట్టి ఆడంబర వ్యక్తులుగా పోల్చి వ్రాసేరు. అలా వ్రాయడం పొరపాటంటాను. మీరేమంటారు?

—వీరందరూ సుప్రసిద్ధులే కావచ్చును. అంతమాత్రాన వారి ఫొటోగ్రఫీ సామాన్య ప్రేక్షకుల విమర్శకు అతీతమని భావించ నవసరం లేదు. సినిమాలో ప్రేక్షకుల దృష్ట్యా అన్నిటికంటె ప్రధానమైనది కథ. ఫొటోగ్రఫీగాని, ఆర్టుగాని, కవిత్వం, సంగీతం మొదలైనవిగాని కథను వివరించడానికీ, దానికి బలం చేకూర్చడానికీ ఉపయోగపడాలేగాని కథను మింగివేయకూడదు. అలా చేసే ఫొటోగ్రఫీని విమర్శించడం పొరపాటెలాగవుతుంది?

* * *

శ్రీ జవ్వాది వెంకటరామారావు—కోరుమిల్లి.

తెలుగు "దేవదాసు" చిత్రసమీక్షకు ఇస్తూ ప్రక్కన హిందీ "దేవదాసు"లోని సైగలు మొదలైన నటులను వేయడానికి హేతు వేమి?

—దేవదాసుగా నటించిన నాగేశ్వరరావు "హిందీ 'దేవదాసు'లో నటించిన సైగల్ చూపినంత సౌలభ్యం, సహజత్వం చూపలేకపోయి"నారని ఒక అభిప్రాయం ఆ సమీక్షలోనే ఉన్నది. ఈ అభిప్రాయాన్ని (*Illustrate*) చేయడంకోసం హిందీ "దేవదాసు"లోని కొన్ని బొమ్మలను ప్రకటించాము. శరత్ దేవదాసుకు సైగల్ ఎంత సన్నిహితంగా వెళ్ళగలిగాడో ఆ బొమ్మలమూలంగా కొంతవరకూ ఊహించవచ్చును. చిత్రం మొత్తంమీద తీసుకున్నా అంతే. హిందీ "దేవదాసు" కేవలం కళాదృష్టితో, దాదాపు శరత్ నవలతో సమానస్థాయిలో నిర్మించబడిన చిత్రం.

* * *

శ్రీ సి. వి. రత్నం—విశాఖపట్నం.

12-8-53 పత్రికలో ప్రచురించిన "నన్ను గురించే" అన్న కథలో శివరామయ్య, రాముడు ఒకసారి ఒకరేయని, వేరొకసారి వేరువేరు అని వ్రాసినారు. దాని అర్థము సవిస్తరముగా తెలుపకోరెదను.

—శివరామయ్య అనే మనిషి తీవ్ర జ్వరంతో బాధపడుతూ వుంటాడు. ఆ జ్వరతీవ్రత మూలంగానూ, సాంసారికమైన చిక్కుల మూలంగానూ అతని మనస్సు వికలమవుతుంది. ఆ స్థితిలో అతడు తనలో తాను మాట్లాడుకుంటూ వుంటాడు. ఇలా గతనతో తాను బిగ్గరిగా మాట్లాడుకునే వ్యక్తులు తరుచు రోడ్లమీద తారసిలుతూ వుంటారు. ఈ వ్యక్తులు ఏవో కష్టాలకు లోనై, వాటికి తట్టుకోలేక, సంపూర్ణ వ్యక్తులుగా జీవించే తాహతులేక, ఇలా శకలాలుగా చీలిపోతారు. ఈ మన స్తత్వాన్ని చమత్కారమైన టెక్నిక్‌తో ఆరుద్రగారు వర్ణించారు. 'శివరామయ్య తనలో తను మాట్లాడుకుంటున్నాడు' అని వట్టినే చెప్పడానికి బదులు శివుడుగాను, రాముడుగాను చీలిపోయి సంభాషణ సాగించినట్లు ఆయన వ్రాశారు. మామూలు మానిసి శివుడుగా, రాముడుగా చీలిపోకుండా శివరామయ్యగా, సంపూర్ణవ్యక్తిగా జీవించగల దూరపు రోజు కోసం ఎదురుచూడ్డం తప్ప మన మేమీ చెయ్యలేం.

* * *

శ్రీ వి. యస్. నారాయణ—పొట్టంగి.

వినోదావారి "దేవదాసు"లో ప్రేమించి వలచి వచ్చిన వనితను, కాలతన్ని తిరిగి ప్రేమించుటలో, డైరెక్టరుగారి వుద్దేశ మేమిటో తెలియచేస్తారా.

—"దేవదాసు" చిత్రంలోని వనితలనెవరినీ డైరెక్టరుగారు ప్రేమించినట్లు దాఖలా లేదు. కనుక మీ ఆరోపణ పూర్తిగా నిరాధారం.

* * *

శ్రీ టి. శోభన్‌బాబు—విజయవాడ.

12-8-53 ఆంధ్రపత్రికలో శ్రీ దాసు వామనరావుగారు "కాలక్షేపం" వ్రాస్తూ 'అది స్వరాజ్యం కాదు శ్వరాజ్యం' అవుతుంది అన్నారు! 'శ్వరాజ్యం' అంటే అర్థం ఏమిటి?

—'శ్వా' అంటే శునకం. 'శ్వరాజ్యం' అంటే శునకరాజ్యం అని అర్థం.

* * *

శ్రీ డి. ఆర్. సుబ్బారావు—విజయవాడ.

ఆర్. కె. ఫిలింసువారు తీస్తున్న ప్రేమలేఖలు చలం రచించిన ప్రేమలేఖలేనా లేక మరొకటా?

"ప్రేమలేఖలు" చిత్రానికి మూలం హిందీలో తీసిన "ఆహ్!". నిర్మాత రాజ్ కపూర్. ఆయనకి తెలుగులో "ప్రేమలేఖలు" అనే గ్రంథం ఉందో లేదోకూడా బహుశా తెలిసివుండదు. కనుక ఆ చిత్రానికీ ఈ గ్రంథానికీ సంబంధమేమీ లేదు. పైగా చలంగారి పుస్తకం మీరు ఒక్కసారి చదివితే అందులో సినిమాకు పనికివచ్చే కథ అంటూ లేదని తెలుస్తుంది.

* * *

శ్రీ మాదల నరసింహారావు—తెనాలి.

చిత్రాలలోని పాటలయొక్క స్టయిల్స్ పాటలు వ్రాసిన కవే నిర్ణయిస్తాడా? లేక పాడేవారే నిర్ణయిస్తారా? లేక సంగీత దర్శకుడే నిర్ణయిస్తాడా?

—పాటలు వ్రాయడంవరకే కవి బాధ్యత. పాడేవారి బాధ్యత పాడడం వరకే. సంగీత దర్శకుడే రాగ వరసలను, నేపథ్య సంగీతాన్ని నిర్ణయిస్తాడు. 

# ప్రముఖ నటుడు బల్రాజ్ సహానీ

(47 వ పేజీ తరువాయి)

కలిగి బల్రాజ్ మాపరుల నిట్టే ఆకర్షిస్తాడు.

జన్మస్థలం రావల్పిండి. అక్కడ స్కూలు చదువు పూర్తయినాక లాహోరు కాలేజీలో చేరి 'ఇంగ్లీషు లిటరేచరు'తో ఎమ్.ఏ. డిగ్రీ పుచ్చుకున్నాడు.

తండ్రి లక్ష్మీ కమర్షియల్ బాంక్ సెక్రటరు. ఆ బాంక్‌లోనే బల్రాజ్ ఒక ఏడాది పనిచేసి, పని నచ్చక తప్పుకున్నాడు.

రచనావ్యాసంగంపై ప్రీతికలవాడవటం చేత మొదట ఒక వారపత్రిక స్థాపించి కొంతకాలం నడిపాడు. తరవాత కలకత్తా వెళ్లాడు. "సచిత్ర భారత్" అనే పత్రికకూ, 'మోడరన్ రివ్యూ' హిందీ అనుబంధ పత్రిక "ఖుషాల్ భారత్" పత్రికకూ కథలు వ్రాసేవాడు. తరవాత శాంతినికేతన్‌లో ఇంగ్లీషు, హిందీ లెక్చరరుగా పనిచేశాడు. 1939 లో గాంధీజీ ఆశ్రమం సేవాగ్రాం వెళ్ళి బేసిక్ ఎడ్యుకేషన్ కమిటీ నివేదికలను హిందీలోకి తర్జుమా చేశాడు.

యుద్ధం వచ్చింది. ఆలిండియా రేడియో స్థాపించడానికి కారకుడైన బి. బి. సి. నిపుణుడు లయొనెల్ ఫీల్డెన్ 1940 లో గాంధీజీని చూడడానికి సేవాగ్రామ్ వచ్చాడు. అప్పుడు ఫీల్డెన్ బల్రాజ్‌నుకూడా కలుసుకొన్నాడు. బి. బి. సి. లో హిందీ ఎనౌన్సరు ఉద్యోగం ఇస్తామని ఫీల్డెన్ అన్నాడు. బల్రాజ్ దీనికి ఒప్పుకున్నాడు. ఇంగ్లండు వెళ్ళి అక్కడ నాలుగేళ్లుండి 1944 లో తిరిగి వచ్చాడు.



విజయా వారి "చంద్రహారం" లో శ్రీరంజని

ఆ సమయంలోనే బల్రాజ్ తన సహాధ్యాయి చేతన్ ఆనంద్‌ను కలుసుకున్నాడు. చేతన్ ఆనంద్ అప్పుడు "నీచా నగర్" చిత్రం తీసే యత్నంలోవుండి, అందులో నటించమని బల్రాజ్‌ను అడిగాడు. బల్రాజ్ ఒప్పుకున్నాడు. కాని అతని తలిదండ్రులకీపని నచ్చలేదు. బల్రాజ్ వారితో తగవు పెట్టుకోవలసివచ్చింది. దానికితోడు చేతన్ ఆనంద్ చిత్రనిర్మాణం కొనసాగలేదు. బల్రాజ్, అతని భార్య తిరిగి ఇంటికి వెళ్లడానికి లేక, కొన్నాళ్లు అవస్థపడ్డారు.

తరవాత అతని భార్య పృథ్వీథియేటర్స్ సంస్థలో చేరింది. ఆమె "దీవార్" నాటకంలో ప్రధాన స్త్రీ పాత్ర ధరించింది. బల్రాజ్ "ఇండియన్ పీపుల్స్ థియేటర్

"ఎసోసియేషన్" లో చేరాడు. మొదటి సారిగా అబ్బాస్ వ్రాసిన "జుబేదా" అనే నాటకం డైరెక్టు చేశాడు. అందులో చేతన్ ఆనంద్, దేవ్ ఆనంద్, అబ్బాస్ వగైరాలు నటించారు. ఆ తరవాత ఐ. పి. టి. ఎ. వారి నాటకాలనేకం అతను డైరెక్టు చేయడమే కాక వాటిలో నటించాడు కూడాను.

అప్పుడు జియా సర్హాదీ "హమ్‌లోగ్" చిత్రం తాలూకు స్క్రిప్టు తయారుచేస్తున్నాడు. ఆ చిత్రంలో బల్రాజ్‌ను నటించ రమ్మని సర్హాదీ ఆహ్వానించాడు. నాటకాల్లో ఒకవంక నటిస్తూనే బల్రాజ్ "హమ్‌లోగ్," "బద్నామ్" చిత్రాల్లో నటించాడు తరవాత "ఆకాష్," "దో బిఘా జమీన్" చిత్రాల్లో నటించాడు.

ఈ ఆఖరి చిత్రంలో పనిచెయ్యడంలో అతను ఎంతో ఆసక్తి చూపాడు. అతని పాత్ర అతని కెంతో నచ్చింది. రైతులు తలపాగా ఎన్ని రకాలుగా చుట్టుకుంటారో, మెలి వేస్తారో అభ్యసించడం కోసం పాలవాళ్ల పేటలో ఎన్నో గంటలు గడిపేవాడు. అలాగే రిక్షా లాగడం కూడా అభ్యసించాడు. కలకత్తా స్వయంగా వెళ్లి, రిక్షావాలాలతో చాలరోజులు గడిపి వారి జీవితం, వారు ఎలా ప్రవర్తించేదీ, ఎలా మాట్లాడేదీ, వారి జీవిత దృక్పథం మొదలైనవన్నీ బాగా పరిశీలించాడు. ఈ పరిశీలనవల్ల "దోబిఘా" చిత్రంలో అంత గొప్ప వాస్తవికత తేగలిగాడు.

బల్రాజ్ సినిమాల్లో నటిస్తున్నా నాటకాలపై అతని ఆసక్తి తగ్గలేదు. కొందరు స్నేహితులతో కలిసి జుహూ ఆర్ట్ థియేటర్ స్థాపించాడు. ఈ కంపెనీవారు చిన్న చిన్న మిత్రబృందాల సభలలో నాటకాలు వేస్తుంటారు

అతను ఇప్పటికీ రచనావ్యాసంగం కొనసాగిస్తూనే వున్నాడు. ప్రస్తుతం తన నాటక, సినిమా అనుభవాలన్నిటినీ పత్రికలలో వ్రాస్తున్నాడు. విస్తృతంగా చదవడం కూడా అతను మానలేదు. మంచి చిత్రాలు, ట్రాజెడీ, కామెడీ, డ్రామా, సంగీత చిత్రాలు, ఏవైనా సరే చూడటం అతనికి యిష్టం

('ఫిల్మ్ ఫేర్' లోని ఒక వ్యాసాన్ని అనుసరించి—) ★

## సినిమా వార్తలు

విజయావారి "చంద్రహారం" నిర్మాణం ఆఖరి ఘట్టంలో పడిందని, మరొక పెద్ద సెట్‌తో ముగుస్తుందని తెలుస్తోంది పెద్ద పెద్ద సెట్టింగులు, జనరంజకం కాగల ఘంటసాల సంగీతం, అద్భుతరస ప్రధానమైన కథగల ఈ జానపద చిత్రం ఈ ఏడాది అంతంలోగాని విడుదల కాదని కూడా తెలుస్తోంది.

* * *

దత్తా ధర్మాధికారి తయారుచేసిన విజయవంతమైన చిత్రం "నస్తైర్యుస్నే" కథను అనుసరిస్తూ, తెలుగులో శుభోదయావారు ఒక చిత్రం తీస్తారట. అనిసెట్టి సుబ్బారావు, పినిసెట్టి శ్రీరామమూర్తిగార్లు మాటలు, పాటలు వ్రాస్తారట. దర్శకుడు తిలక్. పేపరు వర్కు వగైరా పనులు ముగిసి అక్టోబరు ప్రాంతాల్లో సెట్స్‌కు వెడతారట.

* * *

బ్రిటన్‌లో సినిమా క్షామం ఏర్పడిందట. బ్రిటన్‌లోను, అంతకంటె ఎక్కువగా హాలీవుడ్‌లోను చిత్రనిర్మాణం బాగా తగ్గిపోవడం దీనికి ప్రధాన కారణం. హాలీవుడ్ స్టూడియోలు భారీఎత్తున త్రీ డీ చిత్రాలు నిర్మించడమా, మానవేమా అనే సందిగ్ధస్థితిలో పడివున్నందున చిత్ర నిర్మాణం తగ్గిపోయింది. బ్రిటిష్ థియేటర్లలో ఎక్కువగా హాలీవుడ్ సినిమాలే ప్రదర్శింపబడతాయి. హాలీవుడ్‌లో కొన్ని స్టూడియోలు మూసి వేయబడడం, మరికొన్ని రెండు మూడు చిత్రాలకంటె ఎక్కువ నిర్మించకపోవడం బట్టి బ్రిటన్‌కు కావలసినన్ని చిత్రాలు అందడంలేదు మరొక ఆరునెలల్లో ఈ కొరత తీవ్రమౌతుందట ఈలోగా బ్రిటిష్ థియేటర్లు పాత చిత్రాలనే ప్రదర్శించుకొంటున్నాయి. ★



రోహిణీ వారి జానపద చిత్రం "ప్రతిజ్ఞ"లో ఖడ్గధారిణి సావిత్రి

★

(౬ వ పేజీ తరువాయి)

ప్రేమానురాగాభిమానాలు ఉన్నాయి. అదే విధంగా, నేను హిందూమతంలో చెప్పబడిన పద్ధతిగా మోక్షంకోసం సాధకం చేస్తున్నాను. కాని, అన్యమతాలలో చెప్పబడిన ఆరాధన విధానములను ముక్తిసాధన విధానములనుకూడా గౌరవించి శిరసావహిస్తాను" అని మహాత్ముడు ప్రత్యుత్తరంలేని ప్రత్యుత్తరం యిచ్చాడు.

ఆయన సత్యం అనేదానికి కట్టుబడిన దిట్ట. అందువల్ల సత్యం కంటె అతీతమైన మార్గం మరొకటి లేదని వాదించాడు. ఆయన కాంగ్రెసువాదిగా కాలం గడిపినాడు. కాని, కాంగ్రెసుకంటె అతీతమైన సర్వ పక్షాభిమాని ఆయన. స్వరాజ్యం వచ్చిన తర్వాత సర్వోదయ సమాజంలో అన్ని పక్షాలవారికి ఆశ్రయమిచ్చి దేశాభ్యుదయం కోసం అందరూ ఏకీభవించేటట్లు చేయాలన్నాడు. కాంగ్రెసు పార్టీ అనేది ప్రత్యేక రాజకీయపక్షంగా రాణించవలసిన అగత్యం లేదన్నాడు. ఆయన యొక్క రాజకీయ నీతికూడా సర్వపక్షములకు అతీతమైన సత్యమునే నిత్యమూ నమ్ముకొన్నది.

ఇటువంటి సత్యనిరతుడు అవతరించినప్పుడు, చాలా తగాదాలు వస్తూ ఉంటాయి. మామూలు మత నియాలి కతడు అనుమతించడు. భగవంతుని యెదుట అందరూ సమానులే అని అంగీకరించినట్లయితే, ఆమాట సత్యమైనట్లయితే, దేవుని ఆలయంలోనికి అందరికీ ప్రవేశించే అధికారం అవకాశం ఉండాలి. కనుక, అంటరానివారు, అనరానివారు, వినరానివారు ఉండకూడదన్నాడు మహాత్ముడు. కాని, సనాతనులైన హిందూ ధర్మశాస్త్రవేత్తలు, ఆయనను నిందించారు. నిరసించారు - ధిక్కరించారు. వెక్కిరించారు. అంతేకాదు రాజనీతిజ్ఞులుకూడా, ఆయన ప్రారంభించిన సత్యాగ్రహం సాగేపని కాదన్నారు. సహాయ నిరాకరణం అనేది సశాస్త్రీయమైన సక్రమాందోళన కాదని వాదించారు శ్రీ॥ శ్రీ॥ శ్రీమాన్ యస్. శ్రీనివాసయ్యంగారువంటి సుప్రసిద్ధ న్యాయవాదులు- రాజనీతిలో అహింసావ్రతం అనేది ప్రశంసనీయం కాదన్నారు. "అహింస" అంటే "ఇ హి హీ!" అన్నారు. "రాట్నం తిప్పండి"అంటే"మీ రాజనీతి కట్టిపెట్టండి" అన్నారు కొందరు రాజ్యాంగ శాస్త్రవేత్తలు. ఈ మంత్రాలకు చింతకాయలు రాలవన్నారు. వేడినీళ్ళు పోస్తే కొంపలు కాలవన్నారు. యంత్రాలు ఫ్యాక్టరీలు దేశమంతటనూ వృద్ధిపొందకపోతే, దేశానికి ఆర్థికాభ్యుదయం అసంభవం అని ఆర్థిక నీతివేత్తలు ఆయనతో వాదించారు. ఈవిధంగా సనాతనిస్టులు, ధర్మశాస్త్రవేత్తలు, రాజనీతివేత్తలు, ఆర్థికశాస్త్ర సిద్ధాంతులు అందరూ ఆయనతో ఎదిరించి వాదించారు.

ఆరీతిగా వాదించిన వారందరూ ఆయా శాస్త్రములలోని నియమధర్మాలను సాంగోపాంగం చదివి కొమ్ములు తిరిగిన కోవిదులే. ఆర్థికనీతి, రాజనీతి, సంఘనీతి, సర్వమత ధర్మనీతి, ఇవన్నీ గ్రంథాలు చదివి అవగాహన చేసికొన్నవారందరూ నీతిప్రౌఢ విహారులైన నిపుణులే. ఇటువంటి నీతిప్రౌఢ విహారులైన నిపుణుల కందరికీ, అందని అతీతమైన రీతి మహాత్ముని నీతి. ఆయనకు మాత్రం ఆ నిపుణుల నీతిరీతి ఆయన చేతి కందిన కందుకం. అందుచేతనే ఆయన చేబట్టిన "నీతి శ్లాఘ్యపథంబు" జగన్నాథ రథంబువలె సాగింది.

సత్యం అనేది అనంతమైనది. పరిపూర్ణమైన సత్యమును మానవుడు తన అసంపూర్ణమైన జ్ఞానంతో గ్రహించలేడు. గాంధి మహాత్ముడు *Greatest Man of the World*, "అఖిలప్రపంచ పురుషోత్తముడు" అయినప్పటికీ, ఆయన కూడా మానవ మాత్రుడే. అనంతమైన సత్యమును సాంతముగా ఆయన గ్రహించాడని ఎప్పుడూ చెప్పలేదు. ఆయన తన జీవితం అంతా సత్యాన్వేషణకొరకే గడిపినానని మాత్రము విడియపడకుండా వెల్లడించాడు. తన జీవిత చరిత్రను తానే వ్రాసుకున్నాడు. ఆ జీవిత చరిత్ర గ్రంథానికి "*My Experiments in Truth*" "నా సత్యాన్వేషణ పరిశోధనలు" అని నామకరణం చేశాడు. కనుక, ఆయన జీవితం అంతా "సత్యం"కొరకై పరిశోధన చేశాడు. పరిపూర్ణమైన సత్యమును ఆయన గ్రహించినవాడయినట్లయితే ఇంకా సత్యపరిశోధన ఆయన చేయవలసిన అగత్యం ఉండేదికాదు. సత్యం అంటే ఏమిటో పూర్తిగా గ్రహించలేదు గనుక యింకా "సత్యం" పూర్తిగా గ్రహించని అజ్ఞానావస్థలోనే ఉన్నాడు. ఆయనయందు అజ్ఞానం కొంత ఉంది. ఆయన అనేక సందర్భములలో తప్పటడుగులు వేసియుండవచ్చు. ఆయన అజ్ఞాని కావచ్చు. కాని అసత్యవాది కాడు. సత్యానికి విముఖుడుగా ఎప్పుడూ లేడు. అంతరాత్మ చెప్పినదానికి అడుగుదాటి నడచేవాడు కాడు. మనస్సులో న్యాయమని ధర్మమని తాను నమ్మిన దేదో నిష్కపటంగా, త్రికరణశుద్ధిగా బోధించేవాడు.

"తలచినట్లుగ తాను
　　తథ్యంబు పలికి
పలుకుచుండిన రీతి -
　　పనులు తాజేసె."

ఇంతకన్నా సత్యవర్తనంగాని, నీతి నియమంగాని ఇంకొకటి లేదు. మనస్సు, వాక్కు, కర్మ అనేవి మూడూ ఏకమైనప్పుడే అది శుద్ధమైన త్రివేణీ సంగమం. అటువంటి విశుద్ధ పుణ్యతీర్థం మహాత్ముని జీవిత పరమార్థం - అటువంటి నిష్కల్మష హృదయం పాపపుణ్యము తెలియంగని పసిపాపల హృదయం వంటిది. ఇట్టి పసిపాపల హృదయం ఉన్నటువంటివానికే మోక్షం లభిస్తుంది అని యేసుక్రీస్తు ఒక సందర్భంలో అన్నాడు. తన ఆశీర్వాదానికై కొందరు తల్లులు తనవద్దకు తీసికొని వచ్చిన పసిబిడ్డలవంక జూచి యేసుక్రీస్తు యిల్లా అన్నాడు.

"*Verily, verily I say unto you whosoever shall enter the Kingdom cf God shall be like one of these.*"

"నిజంగా, నిశ్చయంగా నేను మీకు తెలియజెప్పునది ఏమనగా, దేవుని రాజ్యంలో ప్రవేశించు ప్రతివాడును వీనివలెనే (యీ బిడ్డలవలెనే) ఉండవలెను."

పసిబిడ్డకు ఆకలిదప్పులు ఉంటాయి. కాని ఇది నా సొత్తు ఇది ఇతరుల సొత్తు అనే జ్ఞానం లేదు. మనకు ఉన్న ఈ అజ్ఞానం ఏమీన్నీ లేదు. ఈజ్ఞానం లేకపోయినప్పటికీ,



**గమనిక**

**ముచ్చటగా ముగ్గురు ప్రస్తుత ప్రకరణం 35-వ పేజీతోనే ఆఖరయిందని పాఠకులు గమనించ ప్రార్థన.** సంపాదకుడు.

అటువంటి అజ్ఞానంలోనే ఆ బిడ్డలకు అతి విశుద్ధమైన కళంకరహితమైన హృదయం ఉంది. స్వార్థం పరార్థం అనేది లేని ఆకలి దప్పులు గల అమాయిక జీవుల ప్రవర్తనలో అసత్యం అనేది అసత్యం. అటువంటివారు లోకనీతి కతీతులు. అటువంటివారి కథలే కర్ణరసాయనములు.

శివయ్యగారు మంచి స్థూలకాయుడు. యాభైఏండ్లకు పైబడిన వయస్సువాడు. ఎర్రగా గుమ్మడిపండులాగున ఉంటేవాడు. సూర్యోదయం అవుతూ ఉండగానే శుభ్రంగా చెరువులో స్నానంచేసి, ఒంటి నిండా విభూతిరేఖలు దిద్ది చెరువు గట్టు మీదనే సంధ్య వార్చుకొని ప్రక్కనున్న సోమేశ్వరాలయం ముఖమంటపంలోకి వెళ్ళి కూర్చుంటేవాడు. ఈలోపుగా చెరువుకు నీళ్ళకైవచ్చిన ఆడవాళ్లవరైనా "శివయ్యగారూ! ఈవేళ మా యింటికి భోజనానికి రావాలి" అని పిలిస్తే వెళ్ళేవాడు. వాళ్ళయింటికి వెళ్ళి బాదం ఆకుల విస్తళ్లు కుట్టియిచ్చేవాడు. కొబ్బరి యీనెల చీపుళ్ళు కట్టియిచ్చేవాడు. ఆడపిల్లలకు పచ్చి తాటియాకులతో బొమ్మలు చేసియిచ్చేవాడు. కొబ్బరి చిప్పల ముక్కలతో ఉంగరాలు చేయడం నేర్పేవాడు. ఇళ్లలోవాళ్లకు వంటపనులలో సహాయంగా మినపపప్పు రుబ్బియిచ్చేవాడు. స్నానాలకు నీళ్ళుతోడి సప్లయి చేసేవాడు. శుభానికీ అశుభానికీ కూడా ఆ బ్రాహ్మణుడు నడుము కట్టుకొని, "నావల్ల అయిన పని యేదైనా సరే చేస్తాను" అనేవాడు. హరిజను డడిగినా సరేననేవాడు గంగిగోవువంటి వాడు. కాని డబ్బు కావాలని ఎవరినీ యాచించి ఎరుగడు. ఎవరింటికైనా పిలిస్తే స్వగృహంలాగున భోంచేసి వెళ్లేవాడు. ఎవ్వరూ పిలువకపోతే, సోమేశ్వరాలయంలో స్వామికి ఎదురుగుండా సంతోషంగా సుఖాసీనుడై యుంటేవాడు. గుళ్లోకి వచ్చి వెళ్లేటటువంటి భక్తులు కొబ్బరికాయలు కొట్టి, ఒకటి రెండు చిప్పలు ఆయన కిచ్చి, అరటి పండ్లు కూడా సమర్పించి, శివునకు నివేదనచేసినా, శివయ్యగారికి సమర్పించినా సమానమైన పుణ్యంగానే భావించేవారు.

ఆయనవద్దకు యీరీతిగా పాలు, కొబ్బరి చిప్పలు, అరటిపండ్లు, బెల్లం, అటుకులు కూడా తెచ్చి, కొందరు గృహస్థులు ఆయన భుక్తికై యిచ్చి, వెళ్లేవారు. ఇన్ని తినుబండారాలు ఆయనవద్ద రోజురుగా ఉంటూ ఉండడంచేత, ఆయనవద్దకు చిన్నపిల్లలు చేరి ఆ పదార్థాలు కొన్ని ఆయనను అడుగకుండానే సంగ్రహించి ఆరగించేవారు. ఆ శివాలయమునకు చక్కని తోట కూడా ఉంది. ఆతోటలో కొబ్బరి, జామ, నారంజ, గన్నేరు, దేవగన్నేరు, నేరేడు, మారేడు, జాజి, నిరజాజి, సంపెంగ, చంపక, గులాబి, పన్నీరు, జపాకుసుమ, మందార, జూకామందార, మల్లి, నిత్యమల్లి, ఆకాశమల్లి, నాగలింగం, నందివర్ధనం, పనస, పంపరపనస, మామిడి, జీడిమామిడి, అరటి, ఏడాకులరటి, మొదలైన ఫలవృక్షాలు పూలచెట్లు ఉన్నాయి. ఆ తోటలో పెద్ద బావినుంచి ఏతాముతో నీళ్ళు తోడే టందుకు తోటవాడుకూడా ఉన్నాడు. ఈ తోటమాలి చంద్రయ్యకు శివయ్యగారంటే ఒక విధమైన భక్తి విశేషంగా ఉంటేది. తోటలో పూచిన పూలు ఏవో కొన్ని, తోటలోని పండు ఏవో ఒకటి ఆయన కిచ్చి నమస్కారం చేసివెళ్లేవాడు. చంద్రయ్యకు గుళ్లోఉన్న శివయ్య కేవలం నందీశ్వరుడు లాగున కన్పించేవాడు. శివయ్య చదువుకున్నవాడు కాడు. శాస్త్రాలు తెలిసిన బ్రాహ్మడూ కాడు. కల్లకపటంలేని గంగిగోవు. చంద్రయ్య ఒకనాడు ఉదయము 7 గం॥కు తోటలో పనిపాటులు చేయడానికి వచ్చాడు. ఇక తిరిగీ సాయంకాలం ఇంటికి వెళ్లదలచినాడు అందువల్ల చల్ల అన్నము ఒక కుండలో పెట్టుకొని రెండు ఉల్లిపాయలున్నూ పచ్చిమిరపకాయలున్నూ కొంచెం ఉప్పుతో సహా మూకుడులో పెట్టి, ఒక చెట్టుకొమ్మకు కట్టిన ఉట్టిలో ఆ కుండను పెట్టి, దానిపైన తన ఉత్తరీయం కప్పివేసి తోటపనిలోకి వెళ్లినాడు. శివయ్యగారికి ఆరోజున ఉదయము 11 గంట లయ్యేవరకూ ఎవరింటివద్ద నుంచీ ఆహ్వానం రాలేదు. "భుక్తికిన్ వేళ యతిక్రమించె"- తోటలోకి ప్రవేశించాడు. బావివద్దకు వెళ్ళి కాళ్లుచేతులు కడుగుకొని, తోటలో ఏవైనా కాయలు పళ్లు ఉంటే తినవలెనని బయలుదేరాడు. తోటలో తిరుగుతూ చెట్టు కొమ్మను వ్రేలాడుచున్న ఉట్టివంక చూశాడు. దానిని పరిశోధించి చూచాడు - ఇది కేవలం "ఆకటి కొదవు సస్యము" ఇది కొమ్మలనున్న తేనెతుట్టె అని భావించి దానిని ఉట్టిమీదనుంచి క్రిందకు దింపి ఆ ఉట్టిమీది ఉత్తరీయమును దుప్పటమును తడికవలె తెరమరుగువలె చెట్లకొమ్మలకు కట్టి, చంద్రయ్య ప్రసాదమునకు శివయ్య పరిషేచనమాచరించి ఓం ప్రాణాయస్వాహా అనిస్వీకరించి దాన్ని భగవంతు డిచ్చిన ప్రసాదముగా కండ్ల కద్దుకొని కడుపార భుజించుచున్న సమయంలో నూతివద్దనున్న చంద్రయ్య తనపని ముగించుకొని, ఆ చెట్టువద్దకు సమీపించి, ఆతెర చాటు కలకల మెరుకపడక "ఎవరయ్యా! ఆ చెట్టుకాడ? కుండలో కూడు కోతుగా జుర్రుతుండావేఁ?" అని ఒక్క కేక రంకె వేసినట్లుగా వేశాడు.

శివయ్య సహజసిద్ధంగా సనాతన సంప్రదాయ వాసనలలో పెరిగిన వాడగుటచేత, తాను భోజనంచేస్తూఉండగా తోటమాలి చంద్రయ్య చూడకూడదనే అభిప్రాయం అభ్యాసవశంగా కలవాడగుటచేత, "ఎవరురా అక్కడ! ఆగు! ఆగు! బ్రాహ్మడు భోంచేస్తూఉంటే, ముందూ వెనుకా తెలియకుండా పరుగెత్తుకొని వస్తావేం! మర్యాదగా ప్రవర్తించు! జాగ్రత!" అని శివయ్య శివమెత్తినట్లుగా సింహగర్జనం చేస్తే, శివాలయపుతోట అంతా మారుమ్రోగింది. ఆ కేకవిని, చంద్రయ్య వెనుకంజవేశాడు. లోపలఉన్న దేవుడు శివయ్యబాబు అని గ్రహించాడు. చంద్రయ్యకు ఆయనమీది ఆగ్రహం అంతా పోయింది. కాని వింతలూరు వాస్తవ్యులందరూ యీ వార్తవిని ముక్కుమీద వేలు వేసికొన్నారు. "శివయ్యకు మతిపోయింది" అన్నారు. కాని "నాకు మతిపోయింది అన్నవాళ్లకే మతిపోయింది" అన్నాడు శివయ్య. "ఆకలి అయితే, అన్నం తినడం అపరాధమా!" చెట్టుమీది పండుకోసి తినడం అపరాధమా? చెట్టుకు కట్టిన ఉట్టిలోని అన్నం తినడం అపచారమా? ఆత్మారాముడికి నివేదనచేశాను. శబరి యిచ్చిన ఎంగిలి పండ్లు తిన్నాడు ఆ రాముడు. ఈ ఆత్మారాముడూ అంతే." అని శివయ్య మనవిచేశాడు. ఆయనకు అంతరాత్మలో ఆవగింజంతయినా దోషం కన్పించలేదు. వింతలూరి వాసులు వెక్కిరించారనే దోషం కలుగలేదు. ఆయన ధర్మశాస్త్రాలు చదివిన పండితుడు కాడు. అజ్ఞాని కావచ్చు. కాని అసత్యం అనేది ఆయన అంతరాత్మలో కంచుకాగడా వేసి వెతకినా కన్పించదు. ఆత్మశుద్ధి అది. అసలైన నీతి అది. అసలైన నీతి ఉంటే హృదయం పునీతం, నవనీతం అవుతుంది. అజ్ఞానంచేత ఎన్ని అవకతవక పనులు చేసినా, "నీతి శ్లాఘ్యపనంబు తప్పరుగదా నిత్యంబు ధీరోత్తముల్" అనే మాట నీతి శాస్త్రానికి నికరమైన కోట.

పటము (వస్త్రము) అడ్డము కట్టినా, కపటములేనివాడు శివయ్య - చంద్రయ్యకు శివయ్య హృదయం ఆదర్శం 

# ★ కాళరాత్రి ★

(25-వ పేజీ తరువాయి)

హరి రివాల్వరు కోసం జేబు తడుము కుంటాడు]

రాజా : అదేం లాభం లేదు నరహరీ. నీ ఆటకట్టిందింక!

నర : (రివాల్వరుతీసి) లేదు - ఇంత తరకూ లేదు గాని ముందుతమరు కూర్చోండి. ఇంతకుముందు ఎక్కడ కూర్చున్నావో అక్కడే అలానే కూర్చో రాజారావ్... ఊఁ—

[రాజారావు కొంత తటపటాయిస్తాడు గాని రివాల్వరు భయపెడుతుంది. వెంటనే కూర్చుంటాడు]

రాజా : అనవసరంగా శ్రమపడు తున్నావ్ నరహరీ! చేసిన పాపం నిన్ను విడిచిపెట్టదు. నువ్వు నారాయణని హత్య చేశావ్!

నర : చేశానా?.....దానికి సాక్ష్యం యేమిటో!

రాజా : నన్ను కూడా అంతమొందించ డానికి ప్రయత్నించడమే.

నర : (రివాల్వరుతో నెమ్మదిగా అతని కేసివస్తూ) నువ్వు చాలా అదృష్టవంతుడివి! ఎలా బ్రతికావో ప్రూసిక్ ఆసిడ్ తాగి కూడా బ్రతికావ్. ఐతేమటుకేం - పోలీసులువచ్చేసరికి ఆత్మహత్య చేసుకున్న నీ శవాన్నే ఈకుర్చీలో చూసేది!

రా : నరహరీ!...ముందా రివాల్వరవతల పెట్టు.

నర : అప్పుడేనా? ఎన్నో రోజుల్నుంచీ నిరీక్షిస్తున్నా నారాయణకోసం! ఆ సీసా కూడా అతనికోసమే దాచివుంచానిన్నాళ్ళూ కాని ఇవ్వాళ మరో మంచి మార్గం దొరికింది; అతనిపని పరిపూర్తి అయింది. అతనికోసం తెచ్చిన విషం నీకు ప్రయోగించినా నిరర్థకమైంది. అయినా ఇంతలో మునుకు పోయిందేమీ లేదు. ఇదుగో - నీదే ఈ రివాల్వరు - కదూ?... నీ హృదయంలో కొంత చోటివ్వమంటోంది. ఊఁ - కదలకు—

[రివాల్వరు రాజా హృదయానికి గురిపెడ్తాడు. మెట్లమీదనుంచి నళిని కెవ్వుమంటూ పరుగెత్తుకువస్తుంది. భోజనాలగది తలుపులు తెరుచుకు గబాల్న కమల, వరండాలోంచి మోహన్, రామానుజం, సుకుమార్ వస్తారు]

మో : నరహరీ!

కమల : ఏమిటిది - మళ్ళీ ఏం జరుగుతోంది? ఓహ్ - రాజారావుగారు బ్రతికే వున్నారా!

[రాజా కుర్చీలోంచి లేచి నొసట చెమట తుడుకుంటాడు. కమల అతనికాళ్ళ మీదపడి—]

నన్ను క్షమించండి రాజారావుగారూ - నాకు తెలిసిన నిజం చెప్పకుండా దాచిపెట్టి మిమ్మల్నందర్నీ దారుణవేదనపాలు జేశాను క్షమించరూ?

రా : మీరుచేసిందేముంది ఇందులో? లేవండి.

నర : కమలా! నువ్వవతలికిరా ముందు. ఊఁ—

మో : ఇక చాలించు నరహరీ నీ వేషాలు. నువ్వు ఇంతకుముందు దంచేసిన ఉపన్యాసంకోసమే నిరీక్షిస్తున్నాం మేమందరమూనూ.

నర : (పళ్ళుబిగబట్టి) ఐతే ఇదంతా ఓ పన్నాగమన్నమాట!

మో : బాగా నే పారిందికదూ?

నర : బాగానే పారిందా? చూపిస్తా నుండండి...రా, కమలా - నువ్వవతలకురా ముందు.

రామా : ఇంకేం ప్రయోజనం లేదు నరహరిగారూ. విన్నాం మేం సర్వమూనూ.

[నరహరి (ముఖం పాలిపోతుంది. రివాల్వరు గట్టిగా పట్టుకు వూపుతూ అందరి వంకా చూస్తాడు]

కమల : (అసహ్యంతో) ఏం - బెదిరిస్తున్నావా అందర్నీ షూట్ చేసి చంపుతావని? అది నీచేత కాదు - నాకు తెలుసు!

నర : కమలా—

కమల : అవును. నీచేత కాదు. నువ్వొక పిరికి పందవు. చూడు నీచెయ్యి ఎలా వణికిపోతోందో! పాప భీతి నిన్నప్పుడే వెన్నంటింది. చేతులారా నారాయణ నిండు ప్రాణాల్ని తీసిన పాపం నిన్ను ఆపాదమస్తకం అప్పుడే దహించేస్తోంది. ఆ రివాల్వరు పట్టుకోడానిక్కూడా అర్హుడివి కాదు నువ్వు—

నర : కమలా—

[నరహరి రివాల్వరు ప్రేలుతుంది. కమల కూలబడుతుంది. రాజారావు పడకుండా పట్టుకుని నెమ్మదిగా నేలమీదకు దించుతాడు. అంతా నిర్ఘాంతపోతారు.

కమల : (అతికష్టంమీద రాజారావు వంక చూసి) క్షమించండి...సరళ...క్షమాపణ...నాకు...క్షమా......

[నేలమీదకు పడిపోతుంది]

మో : కిరాతకుడా! ఇప్పటికైనా నీ ఘాతుకహృదయానికి శాంతి కలిగిందా?

రామా : కలలోనైనా అనుకోలేదు నరహరీ, నువ్వింత భయంకరుడవనీ!

నర : షటప్!... నేనా భయంకరుణ్ణి? నేనా నీచుణ్ణి? నేనింత కిరాతకుణ్ణి ఇంత నీచుణ్ణి ఎందుకయ్యాను? నన్నీ పరిస్థితికి తెచ్చింది (కమలను చూపి) అదీ—నారాయణ - మీరూ - మీరూ - మీరంతానూ ప్రపంచమే తయారుచేసింది నన్నిలా!... కమలంటే నేనెంతగా ప్రేమించానో మీకెవరికన్నా తెలుసా? అది తెలుసుకోగలిగిందా అసలు? నాపాలిట ప్రేమదేవత అనుకున్న నాభార్య తన ప్రేమనంతా పరాయివాడి పాలుచేస్తూంటే చూస్తూ వూరుకోవడానికి నేను దేవుణ్ణి కాదు—ఆ దెయ్యానికి సన్మార్గం బోధించలేకపోయిన మీరూ కాదు దేవుళ్ళు. అంతా కలిసి నాలో పైశాచిక ప్రవృత్తి రెచ్చగొట్టారు. చివరకు నన్నో హంతకుణ్ణి చేశారు!

రామా : అర్థంలేదు నువ్వుమాట్లాడేదాంట్లో. నీభార్య తప్పుచేస్తే- నీకుశిక్షించడానికి అధికారంలేదు. మనల్ని పరిపాలిస్తున్న ప్రభుత్వం ఉన్నది! న్యాయాన్నీ ధర్మాన్నీ అందజేస్తున్న న్యాయస్థానాలు వున్నాయి! అప్పీలు చేసుకోవలసింది వాళ్ళకి!—

నర: చాలించంతటితో నీధర్మపన్నాలు. నీ న్యాయస్థానాలూ, నీప్రభుత్వమూ ఏం చెయ్యగలవ్? విడాకు చీలిప్పిస్తాయి. అంతేనా?... అక్కడికాపు. తియ్ లాంచ తాళం చేతులుతీసి బల్లమీద పెట్టు.

[రామానుజం బెదిరిపోతూ తాళంచేతులు బల్లమీద పెడతాడు. నరహరి తీసుకుంటాడు.]

ఆఁ. ఇహ దయచేసి అందరూ ఆపక్కకి దయచెయ్యండి...ఊఁ - అటు - ఆగోడదగ్గిరికి - ఆఁ - అలా!....ఇక వెళ్ళిపోతాను. ఎక్కడికో ... ఎక్కడవుందో నాగమ్యస్థానం! మానవుల మనుకునే మీ ఘాతుక మృగాలకు, పిచ్చెక్కించే ఈ మానవుల దుర్భర సాన్నిధ్యానికి దూరంగా - ఎక్కడికో వెళ్ళిపోతాను ... ఎవరూ నన్నాపు చెయ్యడానికి ప్రయత్నించకండి!

[వరండాలోంచి పరుగెత్తుకుపోతాడు]

మో : (అతని వెంట పడబోతూ) నేపట్టుకుంటాను వాణ్ణి.

రాజా : (అతన్ని ఆపి) వద్దు మోహన్. ఆపని పోలీసులకే వదిలేద్దాం. మనపనల్లా వాళ్ళకి రిపోర్టుచెయ్యడమే...కాని నేచేసిన ఈపాపం మటుకు నన్ను బ్రతికినంత కాలం వేధిస్తునే వుంటుంది.

[తెర]

**అయిపోయింది.**

(17-వ పేజీ తరువాయి)

గొప్ప డాక్టర్లకు చూపించడం మంచిది అని చెప్పాడు విశ్వంగురించి కూడా ముసలాడు తెలుసుకున్నాడు.

విశ్వం అప్పుడప్పుడు ముసలతని ఇంటికి వెళ్తూంటేవాడు. వారి యోగక్షేమాలు కనుక్కుని వారిని ఊరట పరిచేవాడు. కాని వాళ్లకుటుంబం ఆర్థికంగా అనేక చిక్కులకు లోనైంది. కాంతమ్మ తండ్రి కర్రలడితి ఋణదాతల పాలైంది. ఉన్న సొమ్మంతా మార్చుకు తింటూంటే అది కూడా హరించిపోయింది. చివరికి వాళ్ళు కూడుగుడ్డలకి మొహం వాచి ముష్టెత్తవలసిన గతి పట్టింది

ఇదంతా విశ్వం కళ్లెదుటే కలలా జరిగిపోయింది ఏదో వూరు చివర మురికికొంపల పంచన వాళ్లిద్దరూ బతుకుతూండడం విశ్వం చూశాడు విశ్వం జాలిగుండె కలవాడయినప్పటికీ ఇదివరకులా 'ప్రతీరోజూ వాళ్ల దగ్గిరికెళ్లి మాట్లాడ్డానికి జంకేవాడు. తను ఇంతకుముందే వాళ్లింటికెళ్లడం చూసిన తోటి మిత్రుల అపహాస్యపు దెబ్బలకు తట్టుకోవలసొచ్చింది.

మెయిన్ రోడ్డుమీదా, సందుల్లోనూ, ఒంటిగా అడుక్కుంటూన్నప్పుడు గాని తండ్రి కూడా వున్నప్పుడుగాని కాంతమ్మ విరుచుకు పడిపోయి బలివేసిన కోడిలా విలవిలలాడిపోయేది. ఆరోడ్డుమీద బిందెల్తో ఆమె పై నీళ్లు గుమ్మరించడం జరిగేది. అలా కాంతమ్మ పడిపోవడం చాలాసార్లు చూశాడు

చుట్టూ మూగిన జనాన్ని చీల్చుకుని నువ్వు వెళ్లి కాంతమ్మకి సాయం చెయ్యమని అంతరాత్మ ప్రబోధించేది. కాని అలా చెయ్యడానికి విశ్వానికి ధైర్య సాహసాలుండేవి కావు ఒకనాడు మాత్రం విశ్వం కాంతమ్మ గుర్తించని స్థలంలో నిలబడి ఆమె పరిస్థితి చూశాడు. గుడ్ల నీరు నింపుకున్నాడు

కాంతమ్మ నుదుటిమీదా శరీరంమీది అనేక భాగాలమీదా ఎన్నెన్నో పెద్దపెద్ద దెబ్బలమచ్చలుండడం విశ్వం చూశాడు. కాంతమ్మపరిస్థితి చూసి జాలిపడేవారుండేవారు వాళ్ళు కానీయ్యో, అర్ధణో ఆమెకిచ్చేవారు విశ్వం ఎన్నిసార్లో ఆలోచించేవాడు చేతికి తీవ్రమైన భయంకరమైన కురుపు వేసినంత మాత్రాన చెయ్యి నరుక్కుంటామా అని. కాని రామారావు ప్రవర్తన అతనికి బోధపళ్లేదు. అవుకుగా వున్న పరిస్థితి రాగానే రామారావుకీ ఈమెకీ గల చుట్టరికం విడిపోయింది.

నీటితో తడిసిన చిరుగుబట్టల్లోంచి అస్పష్టంగా కనిపిస్తోన్న ఆ బక్కచిక్కిన శరీరంమీద ఆమె రక్తశూన్యమైన ముఖం మీదా అనేకుల దృష్టులు బద్ధమై వుండడం చూసి విశ్వం వొంటిగా గదిలో ఏడుస్తూండేవాడు.

ఒక రాత్రి ఒంటిగా కాంతమ్మ వెళ్తూన్నప్పుడు విశ్వం ఆమెనికలుసుకున్నాడు:

"మీరా? నేను జ్ఞాపకం వున్నానా:" ఆమె పొడిగా అంది. ఆ సర్వంలోని నిరా" అతను చదవగలిగాడు.

విశ్వం మాట్లాడ్లేదు. ఆమె వైపు శూన్యంగా చూశాడు. ఆమె తలవొంచుకుంది.

"మీరీ వూరునించి ఎక్కడికేనా వెళ్లిపోండి. పువ్వులమ్మినవూర్లో కర్రలమ్మలేరు. ఒకనాడు పచ్చగా బ్రతికిన మీరిలా దిక్కుమాలినవాళ్లై అడుక్కోడం ఏం బావులేదు"

ఆమె అంగీకార సూచకంగా తలూపింది.

విశ్వం ఆమెకి అయిదు రూపాయిలు యిచ్చి చీకటిలో బరువెక్కిన కళ్లతో ఇంటిదారిపట్టాడు. తర్వాతవాళ్లు విశ్వానికి కనిపించలేదు. రైళ్ళలో అడుక్కుంటూందన్న సంగతిమాత్రం అతను తెలుసుకున్నాడు. అప్పణ్ణించీ అతను థర్డుక్లాసులో ఎక్కలేదు. ఎక్కి ఆమెను చూడలేడు. ఒకవేళ చూసినా పలకరించకుండా వుండి తనూ, భయంతో పలకరించలేక ఆమే, మనస్సులు పాడుచేసుకోవడం అతని కిష్టంలేదు. కాంతమ్మ శరీరం పూర్తిగా పాడైపోయినట్లు విశ్వం తెలుసుకున్నాడు. అప్పణ్ణించీ కాంతమ్మ అప్పుడప్పుడు జ్ఞాపకం వొస్తూన్నా మొత్తం మీద మరిచేపొయ్యాడు.

* * *

...బలమైన రైలు కుదుపుకి విశ్వం కళ్లు నులుముకుని లేచాడు. ఏదో స్టేషన్లో బండి ఆగింది. తన కలత నిద్రలో హఠాత్తుగా కాంతమ్మే కలల రూపంలో కనిపించడంవల్ల అతను ఎందుకో భయపడ్డాడు. క్రమేపీ చీకట్లు ముసురుకొంటున్నాయి.

విశ్వం కిటికీ రెక్కలమధ్యనించి ఆకాశం వైపు దృష్టి నిలిపి ఆ నల్లటి భయంకరమైన అంధకారం చూస్తూ నిలబడిపోయాడు. రైలు శూన్యాన్ని చీల్చుకుంటూ అలా సాగిపోతూనే వుంది. ఏడున్నరయ్యేసరికి విశ్వం తన వూర్లో దిగాడు. పొద్దున్నించి ఏమీ తినలేదేమో అతనికి బాగా ఆకలేసింది స్టేషనుకి ఫర్లాంగ్ దూరంలో వున్న లంచ్ హోమ్లో భోజనం చేసి సంచీ పుచ్చుకుని బైటకు వచ్చాడు.

అక్కణ్ణించి సుమారు రెండు మైళ్ళుంటుంది విశ్వం వుంటూన్న అద్దిల్లు. విశ్వానికి మాత్రం అక్కణ్ణించి రిక్షాకట్టించుకుని ఇంటికి వెళ్ళ బుద్ధివెయ్యలేదు. తూర్పు సముద్రంమీంచి చల్లటిగాలి మెల్లిగా వీస్తూ అతనికి కాస్త హాయినిచ్చింది.

ఆకాశంమీద నక్షత్రాలు మినుకు మినుకుమని మెరుస్తూనే వున్నాయి. నడుస్తోన్న విశ్వం బుర్రలో అనేక ఊహాలు కలగడం మొదలెట్టాయి. రైలులో ఇప్పటివరకూ

#  జారిన తెర 

తనని వేధించుకుతిన్న కాంతమ్మ రూపాన్ని అతను ఒక పక్కకి నెట్టి వరలక్ష్మి పెళ్లివైపు మనసు త్రిప్పాడు.

సుబ్బరామయ్యగారు వేలకు వెర్రిలేని మనిషి. ఆయనకో అంటే కోటివేల మంచి సంబంధాలు కాళ్లదగ్గరికొచ్చి పడతై. కాని మూర్ఖపు పట్టుపట్టి ఎందుచేతనో రాజారావుకి రోగం అని తెలుసుండీ కూడా పెళ్లిచెయ్య సంకల్పించాడు. చేజేతులా కూతురు మెడకి ఉరి తగులుస్తున్నాననే విచారం సుబ్బరామయ్య ముఖంలో కనిపించలేదతనికి.

విశ్వం వరలక్ష్మిగురించి చాలా బాధపడ్డాడు. తనకి భయంకరమైన రోగం వుందని తెలుసుండీ కూడా తాళికట్టడానికి తగుదునమ్మా అని తయారయి వచ్చిన రాజారావు పీక నరికేద్దామన్నంత కోపం వచ్చింది. నిష్కారణంగా పెళ్లిలో అందరూ తననే వేలెత్తి చూపెడుతూ తిట్టడం చూసీ కూడా తనతో కూడా రాకుండా ఆ దరిద్రపు పెళ్లిలో వుండిపోయిన జానకిమీద అతనికి అకస్మాత్తుగా కోపం వచ్చి పిడికిళ్లు బిగించాడు.

దారిలో నడుస్తూంటే విశ్వం కళ్లకి అనేక రూపాలు కనిపించినై. ఇంటికి వెళ్లే ప్రయత్నం విరమించుకుని విశ్వం సినిమా రోడ్డు దారిపట్టాడు. ఆరోడ్డుమీద ఎందరో ముష్టిమనుషులు అతని కవుపించారు. తెరమీద ముష్టివాళ్ల కథలు చూసి నిజంగా కన్నీరు కారుస్తూ తెర విడిచి వచ్చేక వీధిలోని ముష్టాడి చేతిలో కానీ వెయ్యకుండా సైకిలురిక్షా కట్టించుకు వెళ్లిపోయే వ్యక్తులు విశ్వానికి కనబడ్డారు.

సినిమా కెళ్ళమని తొందరించిన మనసు అతన్ని మళ్ళీ ఆ ప్రయత్నం నించి త్రిప్పింది. విశ్వం ఈసారి శూన్యంగా ఒకసారి వీధులన్నీ చూసి తన గదికి వెళ్లిపోయాడు. గది తలుపులు తెరిచాడు. గదంతా చీకటితో నిండి వుంది. పక్కవాటాలో వున్న ఇంటి యజమానులు నిద్దర్లో వున్నారు.

ఆ చీకట్లో తడుముకుంటూ వెళ్లి అతను బెడ్‌లాంపు వెలిగించాడు. ఒకసారి ఆవలించి కిటికీలోంచి చలిగాలి వస్తూండడం చేత దానిని మళ్లీ మూసి పడుకోబోతూంటే విశ్వానికి బీరువాకిందనించి తొంగి చూస్తూ వీధి తలుపు పక్కనే వున్న ఒక వస్తువు కనబడింది.

గబగబా వెళ్ళి విశ్వం ఆ వస్తువు తీశాడు. అదొక కవరు. దాన్ని చించి ఇలా చదివాడు:

విశ్వంగారికి నమస్కారాలు:

నా రోగం ముదిరిపోయింది. శరీరం పాడైపోయింది. నా భర్త ఏమయిపోయాడో తెలీదు. మా నాన్న ఒంట్లో జవసత్వాలుడిగిపోయాయి. అయినా ఆయనలాగే కొస్తున్నారు. ఇకనించి ముష్టి మానేస్తున్నాను. ఈ వూళ్లోనే ఒకరిని పెళ్ళాడుతున్నాను. ఆయనికిముప్ఫైఏళ్ళుంటై. చాలా మంచివారు. ఆయనకూడా భయంకరమైన మూర్ఛరోగం వుంది. ఓరోజున కాకతాళీయంగా రైల్లో కలుసుకున్నాం. ఐనా, ఏదో ఒక వ్యాధితో బాధపడుతూన్నంత మాత్రాన ఆవ్యక్తి జీవితసుఖాలకి దూరంగా వుండాలని శాసనం లేదనుకుంటా. నా శరీరంలో రోగం ప్రవేశించగానే నా భర్తకి నేను దూరమయ్యాను. నేను ఏమీ తప్పు పని చెయ్యడం లేదనుకుంటా. ఎప్పుడేనా మీరు ఆ వూరు వస్తే తప్పక నన్ను కలుసుకుంటారనుకుంటున్నాను. నాన్న మీకు నమస్కారాలు చెప్పమన్నారు.

కాంతమ్మ.

విశ్వం బుర్ర ఒక్కసారి గోడకేసి కొట్టుకున్నాడు. ఆ ఉత్తరం చదువుతూంటే అతనికి ఏదో భయంవేయడం కాకుండా ఇన్నాళ్లనించీ తన గుండెపైవున్న ఒక తెరని తొలగించినట్లైంది.

ఆ చీకటిలో అతని కళ్లెర్రబడ్డై. రాత్రి నిద్దర పట్టలేదు. అస్పష్ట భావాలతో తల తిరిగిపోయింది. తెల్లవారుజామున జానకి తలుపు చప్పుడుకు అతని కలతనిద్ర చెదిరిపోయింది. తలుపు తీయగానే జానకి లోపలకి వస్తూ "మీరు వెళ్లిపోయారు గాని వాళ్లెవళ్లకీ చీమ కుట్టినట్టు లేదు. పెళ్లి జరుగుతూంటే రాజారావు రెండుమార్లు మూర్ఛపోయాడు. ఇంతకీ వరలక్ష్మి గొంతు కోశారు. ఇంక అక్కడ వుండలేక వచ్చేశాను" అంది విచారంతో కంపిస్తూన్న స్వరంతో.

బెడ్‌లైటు హెచ్చిస్తూ "జానకీ వరలక్ష్మిగొంతు కెవరూ కొయ్యలేదు మీ నాన్న చాలా మంచిపని చేశాడు" అన్నాడు విశ్వం.

జానకి అర్థంకాక భర్తవైపు ప్రశ్నార్థకంగా చూసింది. తడిసిన కన్నులతో జానకిని చూస్తూ "ఔను జానకీ. మీ నాన్న మంచిపనే చేశాడు" అని కిటికీ రెక్కలు తీసి నల్లటిఆకాశం వేపు చూస్తూ విశ్వం నిలబడ్డాడు.

విశ్వం అలా ఆకాశంమీద చూపు నిలిపి చూస్తూంటే అతనికి ఆ మసక చీకటిలో రాజారావూ, కాంతమ్మా, కాంతమ్మ కాబోయే రెండవ భర్తా, ఇంకా అనేకమంది కుంటిగుడ్డివాళ్ళు ఛాయామాత్రంగా కనిపించారు. వాళ్ళ ముఖాలన్నీ దీనంగా తనని చూస్తూన్నట్టున్నాయి. రాజారావు కాంతమ్మల పెదవులుమాత్రం చాలా అస్పష్టంగా రేఖామాత్రంగా నవ్వుతూన్నట్లున్నాయి. జానకికి మాత్రం విశ్వం ప్రవర్తన బోధపడ్లేదు. ఆమె అలా విస్తుపోయి అతణ్ణి చూస్తోంది. కాంతమ్మతో పరిచయం కలిగినప్పుడైనా, రామారావు నిర్దాక్షిణ్య ప్రవర్తన తెలుసుకున్నప్పుడైనా, తొలగని తెర ఈ సమయంలో తొలగినట్లూహించి తడిసినకళ్లతో చిరునవ్వు నవ్వుతూ భార్యవైపు తిరిగాడు విశ్వం. 





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras